3) శ్లో॥ **ఆమేఖలం** సఞ్చరతాం ఘనానాం-ఛాయామధస్సానుగతాం నిషేవ్య।
ఉద్వేజితా వృష్టిభిరాశ్రయన్తే-శృఙ్గాణి యస్యాతపవన్తి సిద్ధాః॥ - కు.సం.1-5

**5) క్రియారూపములు:-** 1) **ఆపృచ్ఛస్వ**-ఆజ్-ఉపసర్గ, 2) **భవతి**-పూర్వము చెప్పబడినది.

1) ప్రచ్ఛ (ప్రచ్ఛ్) జ్ఞీప్సాయామ్ (అడుగుట), తు.ప్ర., ద్వికర్మకమ్, అనిట్, పరస్మైపదీ. ఆత్మనేపదీ-లోట్-మ.పు.ఏ.- **ఆపృచ్ఛస్వ**- ఆపృచ్ఛేథామ్-ఆపృచ్ఛధ్వమ్. 'ప్రచ్ఛ్' ధాతువు 'పరస్మైపది' అయినప్పటికి దానికి 'ఆజ్' ఉపసర్గ చేరుటచే 'ఆఙ్గినుప్రచ్ఛ్యో రుపసఙ్ఖ్యానమ్' అనుసూత్రము వలన, 'ఆత్మనేపది రూపము' చేకూరినది.

**6) అలంకారములు:-** 'చిరవిరహజం ముఞ్చతో బాష్పముష్ణమ్' అనుచోట ఉత్ప్రేక్ష.

లక్షణమ్:- అవివక్షితసామాన్యా కిఞ్చిచ్చోపమయా సహ।
*అతద్గుణక్రియాయోగాదుత్ప్రేక్షాతిశయాన్వితా॥*

'వివక్షితము కాని సాదృశ్యముకలదియు, కఽఽంచెము ఉపమానసంబంధము కలదియు, ఏ గుణక్రియలు ఉన్నట్లు వర్ణింపబడునో అట్టి గుణక్రియలులేనిదియు, అతిశయముతో కూడినదియు అగునది - ఉత్ప్రేక్ష.' - కావ్యాలఙ్కారః - 2.91 - బాలానందినీవ్యాఖ్యా.

**సఞ్జీవినీవ్యాఖ్యా:-** ఆపృచ్ఛస్వేతి। ప్రియం సఖాయం ప్రియసఖమ్। "రాజాహఃసఖిభ్యష్టచ్" (పా.5.4.91) ఇతి టచ్ సమాసాన్తః। తుఙ్గమున్నతం పుంసాం వన్ద్యైర్నరారాధనీయై రఘుపతిపదై రామపాదన్యాసైర్మేఖలాసు కటకేషు। "అథ మేఖలా। శ్రోణిస్థానేఽద్రికటకే కటిబన్ధేభబన్ధనే" ఇతి యాదవః। అఙ్కితం చిహ్నితమ్। ఇత్థం సఖిత్వాన్మహత్త్వాత్పవిత్రత్వాచ్చ సమ్భావనార్హమ్। అముం శైలం చిత్రకూటాద్రిమాలిఙ్గ్యాపృచ్ఛస్వ 'సాధో! యామి' ఇత్యామన్త్రణేన సభాజయ। "ఆమన్త్రణసభాజనే। ఆప్రచ్ఛన్నమ్" ఇత్యమరః। "ఆఙి నుప్రచ్ఛ్యోరుపసఙ్ఖ్యానమ్" (వా.909) ఇత్యాత్మనేపదమ్। సఖిత్వమ్ నిర్వాహయతి - కాల ఇతి। కాలే కాలే ప్రతిప్రావృట్కాలమ్। సుహృత్సమాగమకాలశ్చ 'కాల' శబ్దేనోచ్యతే। వీప్సాయాం ద్విరుక్తిః। భవతః సంయోగం సమ్పర్కమేత్య చిరవిరహజముష్ణం బాష్ప మూష్మాణం నేత్రజలఞ్చ। "బాష్పో నేత్రజలోష్మణోః ఇతి విశ్వః। ముఞ్చతో యస్య శైలస్య స్నేహవ్యక్తిః ప్రేమావిర్భావో భవతి। స్నిగ్ధానాం హి చిరవిరహసఙ్గతానాం బాష్పపాతో భవతీతి భావః ॥ 12 ॥

**బ్రహ్మప్రకాశికావ్యాఖ్యా:-**ఆపృచ్ఛస్వేతి। హే శ్రీకృష్ణ! తవ ప్రియసఖం,సర్వదా అత్యాజ్యత్వాత్। తుఙ్గమత్యుచ్చమముం శైలం నీలాద్రిమ్। ఆలిఙ్గ్య నవదినాని గుణ్డిచాయాత్రార్థం త్వాం విహాయ గచ్ఛానీత్యాపృచ్ఛస్వ। ఆఙ్గోనుపృచ్ఛోరిత్యాత్మనే। అన్యోఽపి యియాసుర్మహాన్తం ప్రియసఖమాలిఙ్గ్యాపృచ్ఛతే। కిం భూతమ్। పుంసాం వన్ద్యైః రఘుపతేః శ్రీరామస్య లఙ్కాం జిత్వా సీతామానీయాయోధ్యాం ప్రతి ఆగచ్ఛతః। మార్గే శ్రుత్వా త్వాం ద్రష్టుమాగతస్య పదైః పాదచిహ్నైః మేఖలాస్వఙ్కితమ్। ప్రియసఖత్వమభివ్యనక్తి। కాలే కాలే ప్రత్యాషాఢమ్।

నవఘనాభివృష్టజలసమ్పర్కాదుష్ణం వాష్పముష్ణమేవ వాష్పమశ్రు "నవ దినాని యావత్త్వాం కథం త్యజామి, క్షణార్ధమపి న శక్నోమీత్యేవం చిరవిరహోద్ధేతోర్జాతమ్" ముఞ్చతః ప్రకాశయతః యస్య పాదవిజయం కుర్వతో భగవతః సంయోగమేత్య స్నేహవ్యక్తిర్భవతి అన్యస్యాపి సఖ్యురేవం స్నేహవ్యక్తిర్భవతి ॥ 12 ॥

**విద్యుల్లతావ్యాఖ్యా:-** ఏవం స్థితేఽనన్తరకర్తవ్యమాహ -- ఆపృచ్ఛస్వేత్యాది । 'ఆఙి ను ప్రచ్ఛయోః' ఇత్యాత్మనేపదమ్ । గమనానుజ్ఞానార్థమామన్త్రణమ్ ఆప్రశ్నః 'ఆపృచ్ఛ్య రాఘవమనుష్ఠితదేవకార్యమ్' ఇతివత్ । ప్రియసఖం ఇష్టసుహృదమ్, సమయే తవ విశ్రమదాయిత్వాత్, త్వయా వర్షణేనోపకృతత్వాచ్చ, న ఖలు తదనుజ్ఞామన్తరేణ పదమపి గన్తుం యుక్తమితి భావః । తుఙ్గమ్ ఉన్నతమ్, అభ్రంలిహశిఖరం చ, యథా దివాకరః – **'బుద్ధిర్నీచపథేనాత్మవృత్తిం వర్తయితుం రహః । యస్య జాతు న జాయేత సోఽయమున్నత సంజ్ఞితః।'** ఇతి । అనేన తుఙ్గస్య భవతస్తాదృశైవ సఖ్యం ఘటత ఇతి ద్యోత్యతే, 'సమానచిత్తవృత్తిత్వం మిత్రత్వమితి దర్శితమ్' ఇతి లక్షితత్వాత్ । ఆలిఙ్గ్యేతి । చిరదృష్టస్య భవతో ఝటితి యాత్రాప్రసఙ్గస్తేన నానుమోద్యేత, అతస్తమనునయపూర్వమనుకూలయేతి భావః । పుంసాం వన్ద్యైః దర్శనమాత్రేణ తేషామేవ పురుషార్థసాధకైః । 'కృత్యానాం కర్తరి వా' ఇతి షష్ఠీ । మేఖలాసు కటకేషు। బహువచనేన బాహ్వైశ్చర్యదిదృక్షయా తత్ర తత్ర భగవతో విరహణం వ్యజ్యతే । మేఖలాస్వఙ్కితమిత్యత్ర భక్తసమాధిః, తేఽపి కనకపట్టాది నివిష్టానీష్టదేవతాచరణప్రతిబిమ్బాని కణ్ఠసూత్రకటిసూత్రాదిషు ధారయన్తి,యథా 'శ్రీకణ్ఠపద లాఞ్ఛనో భవభూతిర్నామ కవిః' ఇతి । 'అథ మేఖలా । శ్రోణీస్థానేఽద్రికటకే కటిబన్ధేఽసిబన్ధనే' ఇతి వైజయన్తీ । అనేన మహాపురుషాభిగమ్యత్వమప్యస్యేతి స్ఫురతి । కాలే కాలే ప్రతిప్రావృడారమ్భే, తదానీమేవ భవదాగమననియతేః । స్నేహవ్యక్తిః ప్రేమప్రకాశనమ్, స్నిగ్ధవర్ణోదయశ్చ। చిరవిరహజం సంవత్సరదర్శనాభావదుఃఖసమ్భృతమ్। బాష్పం అశ్రు, ధర్మదుర్మదదవదహనమిహిరకిరణ సన్తప్తతయా ప్రథమవర్షావసేకే ప్రసరన్తమూష్మాణం చ । 'బాష్పోఽశ్రుణ్యమ్బుధూమే చ' ఇతి వైజయన్తీ। అనేన చిరాదుపగతే హి సుహృది తదనురాగిణో జనస్యాతీతవిరహదుఃఖానుస్మరణహేతుకం ఝటితి ప్రవృత్తమశ్రుసలిలమనుమాపయతి తద్విషయం హృదయగతమనురాగాతిశయమ్, ఏవమస్యాపీతి ద్యోత్యతే । ఏత్య ముఞ్చత ఇత్యన్వయః। శ్లేషోఽలఙ్కారః । తదనుగృహీతా ప్రస్తుతప్రశంసా వా ॥ 12 ॥



**శ్లో॥ మార్గం తావచ్ఛృణు కథయతస్త్వత్ప్రయాణానురూపం**
**సన్దేశం మే తదను జలద! శ్రోష్యసి శ్రోత్రపేయమ్।**
**ఖిన్నః ఖిన్నః శిఖరిషు పదం న్యస్య గన్తాసి యత్ర**
**క్షీణః క్షీణః పరిలఘు పయః స్రోతసాం చోపభుజ్య॥ 13**

- మృణాలినీ వ్యాఖ్యా -

**పదవిభాగము:-** మార్గమ్, తావత్, శృణు, కథయతః, త్వత్, ప్రయాణ+అనురూపమ్, సన్దేశమ్, మే, తదను, జలద!, శ్రోష్యసి, శ్రోత్రపేయమ్।
ఖిన్నః ఖిన్నః, శిఖరిషు, పదమ్, న్యస్య, గన్తాసి, యత్ర,
క్షీణః క్షీణః పరిలఘు, పయః, స్రోతసామ్, చ,+ఉపభుజ్య॥

**ప్రతిపదార్థము:-** హే మేఘ! - ఓ మేఘుడా!

తావత్ = ఇప్పుడు,
కథయతః = చెప్పుచున్న,
త్వత్ప్రయాణ+అనురూపమ్= నీ ప్రయాణమునకు తగిన,
మార్గమ్ = త్రోవను,
**శృణు** = వినుము.
తదను = అటు పిమ్మట,
శ్రోత్రపేయమ్ = వీనులచేత త్రాగదగినదైన (మిక్కిలి ఆసక్తితో వినదగిన),
మే = నాయొక్క
సన్దేశమ్ = సమాచారమును,
శ్రోష్యసి = వినగలవు,
యత్ర = ఏ త్రోవయందు,
ఖిన్నః ఖిన్నః (సన్) = (ఎప్పుడు) అలసిన వాడవగుదువో (అపుడు)
శిఖరిషు = పర్వతములందు,
పదమ్ = అడుగును,
న్యస్య = ఉంచియు,
క్షీణః క్షీణః (సన్) = మిక్కిలి చిక్కిపోయినవాడ వగుచు,
స్రోతసామ్ = ప్రవాహములయొక్క
పరిలఘు = మిక్కిలి తేలికయగు,
పయః = జలమును,
ఉపభుజ్య = సేవించి,
**గన్తాసి** = పోగలవో!

**తాత్పర్యము:-** ఓ మేఘుడా! ఇప్పుడు (నేను) చెప్పుచున్న నీ ప్రయాణమునకు తగిన మార్గమును వినుము. అటు పిమ్మట మిక్కిలి ఆసక్తితో వినదగిన నా సమాచారమును వినగలవు. ఏ మార్గమునందు (ఎప్పుడు) అలసినవాడవగుదువో (అప్పుడు) పర్వతము లందు నిలిచి, చిక్కిపోయినవాడవగుచు ప్రవాహములయొక్క మిక్కిలి తేలికయగు జలమును సేవించి వెళ్ళగలవో!

- పదాదర్శః -

**1) విభక్తులు-అవ్యయములు-కృత్తులు-క్రియలు:-**

జలద-(సం.ప్ర.ఏ.), తావత్-(అవ్య.), కథయతః-(పం.ఏ.), త్వత్ప్రయాణాను రూపమ్-(ద్వి.ఏ.), మార్గమ్-(ద్వి.ఏ.), శృణు-(క్రియ), తదను-(ద్వి.ఏ.), శ్రోత్ర

పేయమ్-(ద్వి.ఏ.), మే-(ష.ఏ.), సన్దేశమ్-(ద్వి.ఏ.), శ్రోష్యసి-(క్రియ), యత్ర-(అవ్య.), ఖిన్నః (ఖిన్నః)-(ప్ర.ఏ.), శిఖరిషు-(స.బ.), పదమ్-(ద్వి.ఏ.), న్యస్య-(అవ్య.)(ల్యబన్తం) కృత్తు, క్షీణః(క్షీణః)-(ప్ర.ఏ.), స్రోతసామ్-(ష.బ.), పరిలఘు-(ద్వి.ఏ.), పయః-(ద్వి.ఏ.), ఉపభుజ్య-(ల్యబన్తము) (కృత్తు), గన్తాసి-(క్రియ).

**2) సమాసములు:-**

అ) తవ ప్రయాణః త్వత్ప్రయాణః (షష్ఠీతత్పురుషః), త్వత్ప్రయాణస్య అనురూపమ్ త్వత్ప్రయాణానురూపమ్ (షష్ఠీతత్పురుషః)

ఆ) శ్రోత్రాభ్యాం పేయమ్ - శ్రోత్రపేయమ్ (తృతీయాతత్పురుషః)

ఇ) పరితః లఘుః, పరిలఘు (గతిసమాసః) 'కుగతిప్రాదయః'.

**3) పాఠాంతరములు:-** 1) మార్గం తావత్ > మార్గం మత్తః, 2) ప్రయాణానురూపమ్ >ప్రయాణానుకూలమ్, 3) శ్రోత్రపేయమ్ > శ్రవ్యబన్ధమ్, 4) ఉపభుజ్య > ఉపయుజ్య, 5) తదను జలద > జలద తదను.

**4) పదవ్యుత్పత్తి-నిఘంటుప్రమాణములు-కావ్యప్రయోగములు:-**

**అ) మార్గం తావత్ :**

"We now begin the geographical part of the poem, which as faras it can be made out through the difference of ancient and modern appellations, seems to be very accurately conceived. The two extreme points of cloud's progress are the vicinity of Nagpur, ....and the mountain Kailasa, or rather Himalaya Range. During this course, the poet notices some of the most celebrated places, with the greater number of which we are still acquainted. In the first instance, we have here his direction due north from the mountain of Ramagiri." - Wilson.

**ఆ) శిఖరిషు** - శిఖరాణి సన్తి యేషు శిఖరిణః, శిఖరమ్ అస్త్యస్య ఇతి,

1) *శ్లో॥ రుద్రాణాం శఙ్కరశ్చాస్మి-విత్తేశో యక్షరక్షసామ్ ।*
*వసూనాం పావకశ్చాస్మి-మేరుః **శిఖరిణా**మహమ్ ॥* -భ.కా.10-23

"ఏకాదశరుద్రులలో నేను శంకరుడను, మరియు యక్షరాక్షసులలో నేను ధనాధిపతియైన కుబేరుడను, అష్టవసువులలో నేను అగ్నిని, మరియు పర్వతములలో నేను మేరువును". అని భగవానుని వాక్యము.

**ఇ) న్యస్య** - ల్యబన్తావ్యయము. 'ల్యప్' ప్రత్యయము అంతముగ కలిగిన పదములు 'ల్యప్' ప్రత్యయాన్తములగును. ధాతువు ఉపసర్గతో చేరినపుడు 'క్త్వా' ప్రత్యయమునకు బదులుగా 'ల్యప్' ప్రత్యయము ధాతువుకు సమకూరును. 'ల్యప్' ప్రత్యయములోని 'య' మాత్రమే మిగిలియుండును.

1) ని+అస్+క్త్వా(ల్యప్) > న్యస్య - ఉంచి, 2) ఉప + భుజ్ + క్త్వా (ల్యప్) > ఉపభుజ్య - సేవించి.

ఈ) **'శ్రోత్రపేయమ్'** - అనుటచే 'మేఘదూతకావ్యము' అమృతకల్పముగా నుండు ననునది - 'ధ్వని' .

**5) క్రియారూపములు:-** 1) శ్రోష్యసి, 2) గన్తాసి.

1) శ్రు-శ్రవణే (వినుట) - భ్వాది ప్రకరణమ్, సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ. లృట్- మధ్యమపురుషైకవచనమ్. **శ్రోష్యసి** - శ్రోష్యథః - శ్రోష్యథ.

2) గమ (గమ్) గతౌ (వెళ్ళుట) - భ్వాది ప్రకరణమ్, సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ. లుట్ - మధ్యమపురుషైకవచనమ్ - **గన్తాసి** - గన్తాస్థః - గన్తాస్థ.

**6) అలంకారములు:-** సమాసోక్త్యలంకారము. శ్లోకమున-ఉత్తరార్ధమున మేఘుని యందు సామాన్యుడైనబాటసారి వ్యవహారము సమారోపింపబడుటచే సమాసోక్త్యలంకారముగ భావింపదగును.

లక్షణమ్:- కా॥ *యత్రోక్తే గమ్యతేఽన్యోఽర్థస్తత్సమానవిశేషణః।*
*సా సమాసోక్తిరుద్దిష్టా సంక్షిప్తార్థతయా యథా॥*

'ఏది చెప్పినపుడు దానితో సమానమగు విశేషణములు గల మరియొక అర్థము గమ్యమగునో,అది ఆ సంక్షిప్తమగు అర్థము కలదగుటచే,'సమాసోక్తి' యని చెప్పబడును.
- కావ్యాలఙ్కారః-2-79 - బాలానందినీవ్యాఖ్యా.

**సఞ్జీవినీవ్యాఖ్యా:-** సమ్ప్రతి తస్య మార్గమ్ కథయతి-మార్గమితి। హే జలద! తావదిదానీమ్ కథయతః, మత్త ఇతి శేషః। త్వత్ప్రయాణస్యానురూపమనుకూలం మార్గమధ్వానమ్। "మార్గో మృగమదే మాసి సౌమ్యర్క్షేఽన్వేషణేఽధ్వని" ఇతి యాదవః। శృణు। తదను మార్గశ్రవణానన్తరం శ్రోత్రాభ్యాం పేయం పానార్హమ్, అతితృష్ణయా శ్రోతవ్యమిత్యర్థః। 'పేయ' గ్రహణాత్ సన్దేశస్యామృతసామ్యం గమ్యతే। మే సన్దేశం వాచికమ్। "సన్దేశవాగ్వాచికం స్యాత్" ఇత్యమరః। శ్రోష్యసి। యత్ర మార్గే ఖిన్నః ఖిన్నోఽభీక్ష్ణం క్షీణబలః సన్। "నిత్యవీప్సయోః" (పా. 8.1.4) ఇతి నిత్యార్థే ద్విర్భావః। శిఖరిషు పర్వతేషు పదం న్యస్య నిక్షిప్య, పునర్బలలాభార్థం క్వచిద్విశ్రమ్యేత్యర్థః। క్షీణః క్షీణోఽభీక్ష్ణం కృశాఙ్గః సన్, అత్రాపి కృదన్తత్వాత్పూర్వవద్ద్విరుక్తిః। స్రోతసాం పరిలఘు గురుత్వదోషరహితమ్, ఉపలాస్ఫాలనఖేదితత్వాత్పథ్యమిత్యర్థః। తథా చ వాగ్భటః (అష్టాఙ్గ.హృ. 1.5.9-10) - "ఉపలాస్ఫాలనక్షేపవిచ్ఛేదైః ఖేదితోదకాః। హిమవన్మలయోద్భూతాః పథ్యా నద్యో భవన్త్యమూః।" ఇతి। పయః పానీయముపభుజ్య శరీరపోషణార్థమభ్యవహృత్య చ గన్తాసి గమిష్యసి ॥ గమేర్లుట్ ॥ 13 ॥

**బ్రహ్మప్రకాశికావ్యాఖ్యా:–** కేన మార్గేణ, కం దేశం ప్రతి గచ్ఛామీతి ప్రష్టుకామమప్యాహ– మార్గం తావదితి। జలద ఇవాచరతీత్యాయలుగతాత్పచాదిజ్। నీలత్వాదుపసన్నార్తిహరత్వాద్వా మేఘసదృశ! హే శ్రీకృష్ణ! కథయతో మేఘసకాశాత్తావత్ప్రథమం త్వత్ప్రయాణాను రూపం మార్గం శృణు । తదను తదనన్తరం శ్రోత్రేణ కర్ణేన పేయం గ్రాహ్యమ్ । శ్రోతృభిరపేయమవిస్మర్యం వా। సన్దేశం సమ్యఞ్చం దేశం సప్తదినావస్థేయం నీచైరాఖ్యం గిరిమిత్యాదినా వర్ణనీయమాదమ్బరమణ్డపం శ్రోష్యసి। యత్ర మార్గే పదగమనాత్ ఖిన్నః ఖిన్నస్త్వం, పూర్వం శిఖరిషు నీలాద్రిపాదేష్విదానీం ద్వావింశతిసోపానతయా కృతేషు పదం న్యస్య గన్తాసి । వహ్వన్నపూపాదిభోగాత్ క్షీణస్త్వం పరిభావేన లఘు మనోజ్ఞం స్రోతసామభినవ – ప్రవృద్ధమహానదీప్రవాహాణాం పయః వాతేనానీతం పృషద్రూపం, భక్తైః ప్రపానకాదిరూపేణ నివేదితం వా। ఉపభుజ్య గన్తాసి ॥ 13 ॥

**విద్యుల్లతావ్యాఖ్యా:–** ఏవమనుష్ఠితానుష్ఠేయస్య ప్రతిష్ఠమానస్య భవతః కృత్యద్వయమిదానీమవశిష్టం మార్గశ్రవణం సన్దేశశ్రవణం చ, తయోః ప్రథమభావితయా ప్రథమం మార్గమవధారయేత్యాహ –– మార్గమితి। తావత్ ఇతో దేశాద్యదవధి గన్తవ్యం తదవధి, సాకల్యేన వా। 'యావత్తావచ్చ సాకల్యేఽవధౌ మానేఽవధారణే' ఇత్యమరః। శృణ్వితి। శ్రవణమేవ ప్రార్థ్యతే, గ్రహణాదీని మహామేఘావినస్తవానుషఙ్గికానీతి భావః। మే మత్సకాశాదిత్యర్థః। త్వత్ప్రయాణానురూపం రసికజనమౌలేః పరమేశ్వరశక్తిశాలినస్తవ యాత్రానుగుణో భుక్తిముక్తిసాధనమేకః పన్థాః, నీరసానాం నాస్తికానాం చ కమపి పుమర్థమస్పృశన్నన్య ఏవేతి భావః। అనేన దయితాజీవితపరిరక్షణకృతక్షణతయా త్వరితస్యాపి 'వక్రః పన్థాస్తవ భవతు చ' ఇతి, 'స్థాతవ్యం తే నయనవిషయమ్' ఇత్యాది చ వక్ష్యమాణం మేఘగమనౌచిత్యాపేక్షయేతి మన్తవ్యమ్ । తదను మార్గశ్రవణానన్తరమ్ । శ్రావ్యబన్ధం శ్రోతవ్యశబ్దసన్దర్భమ్, అతికరుణార్థపరిపోషితవిప్రలమ్భరససుధానిర్భరగర్భత్వాత్। శృణోతేః 'ఓరావశ్యకే' ఇతి ణ్యత్ప్రత్యయః। జలదేతి, శ్రవణసమయే రసార్ద్రహృదయతయా తవాపి బహులబాష్పఝురీపరీతనయనతా భావినీతి ద్యోత్యతే, యథా వక్ష్యతే –– 'త్వామప్యస్రం నవజలమయం మోచయిష్యత్యవశ్యం ప్రాయః, సర్వో భవతి కరుణావృత్తిరార్ద్రాన్తరాత్మా' ఇతి । ఖిన్నః ఖిన్నః అధ్వగమనేన యదా యదా శ్రాన్తిరుద్భవతి, తదా తదేత్యర్థః, 'అధ్వఖిన్నాన్తరాత్మా' ఇతి వక్ష్యమాణత్వాత్ । శిఖరిషు న పునర్నగమాత్రేషు, గగన సరణివితతతుఙ్గశృఙ్గాణామేవ త్వదుపగమయోగ్యత్వమితి భావః । క్షీణః క్షీణః ఉచిత ప్రదేశవర్షణేన యదా యదా సలిలవిచ్ఛేదో భవతి,తదా తదేత్యర్థః। స్రోతసామ్ అగాధతయా శశ్వదవిచ్ఛిన్నప్రసారాణాం మహానదీప్రవాహాణామ్। అత ఏవ తరుకుఞ్జశిలాకుఞ్జాద్యభిఘట్టనేన పరిలఘు సర్వతో గలితగౌరవమ్। "ఉపలాస్ఫాలనాక్షేపవిచ్ఛేదైః ఖేదితోదకాః। హిమవన్మలయోద్భూతాః పథ్యాః"ఇతి వాహటః। ఉపలక్షణం చైతన్మాధుర్యనైర్మల్యయోః। అనేన తవ శరీరస్థితిచిన్తా విశ్రమస్థానచిన్తాపి న భవిష్యతీతి ద్యోత్యతే । అత్ర స్వభావోక్త్యలఙ్కారః ॥ 13 ॥

శ్లో॥ అద్రేః శృఙ్గం హరతి పవనః కింస్విదిత్యున్ముఖీభి
ర్దృష్టోత్సాహశ్చకితచకితం ముగ్ధసిద్ధాఙ్గనాభిః।
స్థానాదస్మాత్సరసనిచులాదుత్పతోదఙ్ముఖః ఖం
దిఙ్నాగానాం పథి పరిహరన్స్థూలహస్తావలేపాన్॥ 14

- మృణాలినీ వ్యాఖ్యా -

**పదవిభాగము:-** అద్రేః, శృఙ్గమ్, హరతి, పవనః, కింస్విత్,+ఇతి,+ఉన్ముఖీభిః, దృష్ట+ఉత్సాహః,+చకితచకితమ్, ముగ్ధ-సిద్ధ+అఙ్గనాభిః। స్థానాత్,+అస్మాత్, సరస-నిచులాత్,+ఉత్పత+ఉదఙ్ముఖః, ఖమ్, దిఙ్నాగానామ్, పథి, పరిహరన్, స్థూల-హస్త+అవలేపాన్॥

**ప్రతిపదార్థము:-** హే మేఘ! - ఓ మేఘుడా!

పవనః = వాయువు,
అద్రేః = (చిత్రకూట) పర్వతము యొక్క,
శృఙ్గమ్ = శిఖరమును,
హరతి కింస్విత్ = హరించి తీసికొనిపోవుచున్నదా యేమి?
ఇతి = అని,
ఉన్ముఖీభిః = మోముపైకెత్తిన
ముగ్ధ-సిద్ధ+అఙ్గనాభిః = తెలియనివారగు సిద్ధకాంతలచేత,
చకితచకితమ్ (యథా తథా)= సంభ్రమముగ,
దృష్ట+ఉత్సాహః (సన్) = సంరంభము గలవాడగుచు,
సరస-నిచులాత్ = తడిగల ప్రబ్బలి చెట్లుగల,
అస్మాత్ స్థానాత్ = ఈ స్థానము నుండి,
పథి = ఆకాశ మార్గమునందుగల,
దిఙ్నాగానామ్ = దిగ్గజములయొక్క,
స్థూల-హస్త+అవలేపాన్ = లావైన తొండపు విసురులను,
పరిహరన్ = తప్పించుకొనుచు,
ఉదఙ్ముఖః (సన్) = ఉత్తరాభిముఖుడవై,
ఖమ్ = ఆకాశమును గూర్చి,
**ఉత్పత** = పైకి పొమ్ము.

**తాత్పర్యము:-** ఓ మేఘుడా! వాయువు చిత్రకూటపర్వతశిఖరమును పెకలించి తీసికొని పోవుచున్నదా యేమి'అని మోము పైకెత్తిన, తెలియనివారగు సిద్ధకాన్తలచేత సంభ్రమముగ, సంరంభముగలవాడవై తడిగల ప్రబ్బలిచెట్లుగల ఈ స్థానమునుండి ఆకాశ మార్గము నందుగల దిగ్గజముల యొక్క లావైన తొండపు విసురులను తప్పించు కొనుచు, ఉత్తరాభి ముఖుడవై ఆకాశమును గూర్చి పైకి పొమ్ము.

- పదాదర్శః -

**1) విభక్తులు-అవ్యయములు-కృత్తులు-క్రియలు:-**

పవనః-(ప్ర.ఏ.), అద్రేః-(ష.ఏ.), శృఙ్గమ్-(ద్వి.ఏ.), హరతి-(క్రియ), కిమ్+స్విత్>

(అవ్యయద్వయ సంయోగము), ఇతి-(అవ్య.), ఉన్ముఖీభిః-(తృ.బ.), ముగ్ధ... నాభిః -(తృ.బ.), చకితచకితమ్-(క్రియావిశేషణము), దృష్టోత్సాహః-(ప్ర.ఏ.), సరస నిచులాత్-(పం.ఏ.), అస్మాత్ స్థానాత్-(పం.ఏ.), పథి-(స.ఏ.), దిఙ్నాగానామ్-(ష.బ.), స్థూల...లేపాన్-(ద్వి.బ.), పరిహరన్-(ప్ర.ఏ.), ఉదఙ్ముఖః-(ప్ర.ఏ.), ఖమ్-(ద్వి.ఏ.), ఉత్పత-(క్రియ).

**2) సమాసములు:-**

అ) ఉన్నతం ముఖం యాసాం తాః, ఉన్ముఖాః (బహుప్రీహిః), తాభిః ఉన్ముఖీభిః.

ఆ) సిద్ధానామ్ అంగనాః సిద్ధాఙ్గనాః (షష్ఠీతత్పురుషః), ముగ్ధాః చ తాః సిద్ధాఙ్గనాః (కర్మధారయః), ముగ్ధసిద్ధాఙ్గనాః తాభిః, ముగ్ధసిద్ధాఙ్గనాభిః.

ఇ) దృష్ట ఉత్సాహో యస్య సః, దృష్టోత్సాహః (బహుప్రీహిః).

ఈ) సరసా నిచులా యస్మింస్తత్, సరసనిచులమ్ (బహుప్రీహిః), తస్మాత్, సరసనిచులాత్

ఉ) దిశాం నాగాః, దిఙ్నాగాః, (ష.త.), తేషామ్, దిఙ్నాగానామ్.

ఊ) స్థూలాశ్చ తే హస్తాః, స్థూలహస్తాః, తేషాం అవలేపః, స్థూలహస్తావలేపః, తాన్ స్థూలహస్తావలేపాన్ (ష.త.)

ఋ) ఉదక్ ముఖం యస్య సః, ఉదఙ్ముఖః, (బహుప్రీహిః).

**3) పాఠాంతరములు:-** 1) హరతి > వహతి, 2) దృష్టోత్సాహః > దృష్టోచ్ఛ్రాయః, 3) హస్తావలేపాన్ > హస్తావలేహాత్.

**4) పదవ్యుత్పత్తి-నిఘంటుప్రమాణములు-కావ్యప్రయోగములు:-**

**అ) దిఙ్నాగానామ్ : సరసనిచులాత్.**

'మేఘదూతమహాకావ్యము' నకు 'ప్రదీపః' అనుపేర వ్యాఖ్యను అందించిన శ్రీ దక్షిణావర్తనాథుని నుండి (ప్రథమముగ) చేజారిన (నిచుల-దిఙ్నాగుల వ్యవహార) భావజాలము తరువాత కాలమున ఈ మహాకావ్యమునకు వ్యాఖ్యలందించిన కొందఱు వ్యాఖ్యానకారులను అంటుకొనినది. దానిని ప్రామాణికముగ స్వీకరింప దగదని రూఢిగ చెప్పదగును. ఏలయన, 'మహాకవి శ్రీకాళిదాసు అసామాన్యుడు, అద్వితీయుడు, సంస్కృతసాహిత్యమున అమరుడు. పరమమాహేశ్వరాచార్యుడు ఐనటువంటి మహోన్నతుడు-ఈర్ష్యాళువు కానేకానేరడు'. 'దక్షిణావర్త, మల్లినాథాదులు మన్నింతురు గాక !' ఇట మీదు మిక్కిలి 'కాత్యాయనీ' వ్యాఖ్య చూడదగును.

ఆ) **నిచులః** - 1) (i) **నిచోలతి** సముచ్ఛ్రయతీతి । ని+చుల+'ఇగుపదజ్ఞేతి' క - ఇజ్జల వృక్షః, (ii) శ్లో॥ ....... ఇజ్జలో **నిచులః** స్మృతః॥ 194., (iii) 'ఇజ్జలో హిజ్జలశ్చాపి **నిచుల**శ్చామ్బుజస్తథా' - ఇతి భావప్రకాశే. అని పేర్కొన్నది అభిధానరత్నమాలా.

2) శ్లో॥ నిచోలః ప్రచ్ఛదపటో-నిచులశ్చోత్తరచ్ఛదః॥ అని అభిధానచిన్తామణి(340) నాలుగు పేర్లు (నిచోలః, ప్రచ్ఛదపటః, నిచులః, ఉత్తరచ్ఛదః) పేర్కొన్నది.

ఇ) **దిఙ్నాగానామ్** - దిశాం నాగాః దిఙ్నాగాః. దిశో గజః దిగ్గజః.

*శ్లో॥ ఐరావతః పుణ్డరీకః కుముదాఞ్జనవామనాః ।*
*పుష్పదన్తః సార్వభౌమః సుప్రతీకశ్చ దిగ్గజాః॥* ఇతి హలాయుధకోశే 104

1) ఐరావతము-Indra's elephant placed at the east quarter-తూర్పు.
2) పుణ్డరీకము-Agni's elephant placed at the south-east quarter-ఆగ్నేయము.
3) కుముదము-Pluto's (యముడు) elephant placed at the south quarter-దక్షిణము.
4) అంజనము-Nairit's elephant placed at the south-west quarter-నైరృతి.
5) వామనము-Neptune's (వరుణుడు) elephant placed at the west quarter-పడమర.
6) పుష్పదన్తము-Wind's(మరుత్తు)elephant placed at the north-west quarter-వాయవ్యం.
7) సార్వభౌమము-Kubera's elephant placed at the north quarter-ఉత్తరము.
8) సుప్రతీకము-Shiva's (ఈశానుడు) elephant placed at the east-quarter-ఐశాని.

**5) క్రియారూపములు:-** 1) హరతి, 2) ఉత్పత-ఉత్ ఉపసర్గ.

1) హృఞ్ (హృ)- హరణే (తీసికొనిపోవుట), భ్వా.ప్ర., అనిట్, ద్వికర్మకమ్, ఉభయపదీ, పరస్మైపదీ, లట్-ప్రథమపురుషైకవచనమ్, **హరతి**-హరతః-హరన్తి.

2) పత్ల (పత్)-గతౌ(క్రిందపడుట), భ్వాదిప్రకరణమ్, సేట్, అకర్మకమ్, పరస్మైపదీ. లోట్-మధ్యమపురుషైకవచనమ్, **ఉత్పత/ఉత్పతతాత్**-ఉత్పతతమ్-ఉత్పతత.

**6) అలంకారములు:-** సిద్ధాంగనలకు మేఘమునందు గిరిశిఖరమను భ్రాంతి గలుగుటచే నిట అభేదోక్తి'. కనుక **సందేహాలంకార** మనదగును. లక్షణమ్:-

*శ్లో॥ విషయో విషయీ యత్ర సాదృశ్యాత్కవిసమ్మతాత్।*
*సందేహగోచరో స్యాతాం సందేహాలంకృతిశ్చ సా॥* -ప్రతాపరుద్రీయే-అ.ప్ర. - 59.

**సఞ్జీవినీవ్యాఖ్యా:-** అద్రేరితి । పవనో వాయురద్రేశ్చిత్రకూటస్య శృఙ్గం హరతి కిం స్విత్? 'కింస్విత్'- శబ్దో వికల్పవితర్కార్థాదిషు పఠితః । ఇతి శఙ్కయోన్ముఖీభిరున్నతముఖీభిః॥ "స్వాఙ్గాచ్చోపసర్జనాదసంయోగోపధాత్" (పా. 4.1.54) ఇతి ఙీష్ । ముగ్ధాభిర్మూఢాభిః॥ "ముగ్ధః సున్దరమూఢయోః" ఇత్యమరః । సిద్ధానాం దేవయోనివిశేషాణామఙ్గనాభిశ్చకిత చకితం చకితప్రకారం యథా తథా॥'ప్రకారే గుణవచనస్య' (పా.8.1.12) ఇతి ద్విర్భావః॥ దృష్టోత్సాహో దృష్టోద్యోగః సన్ । సరసా ఆర్ద్రానిచులాః స్థలవేతసా యస్మింస్తస్మాత్ । "వానీరే కవిభేదే స్యాన్నిచులః స్థలవేతసే" ఇతి శబ్దార్ణవే । అస్మాత్స్థానాదాశ్రమాత్ పథి నభోమార్గే దిఙ్నాగానాం దిగ్గజానాం స్థూలా యే హస్తాః కరాస్తేషామవలేపానాక్షేపాన్ పరిహరన్ । "హస్తో నక్షత్రభేదే స్యాత్కరేభకరయోరపి" ఇతి॥ "అవలేపస్తు గర్వే స్యాత్క్షేపణే దూషణేఽపి చ" ఇతి చ విశ్వః । ఉదఙ్ముఖః సన్ । అలకాయా ఉదీచ్యత్వాదిత్యాశయః ।

ఖమాకాశమ్ । ఉత్పతోద్గచ్ఛ । అత్రేదమప్యర్థాన్తరం ధ్వనయతి – రసికో నిచులో నామ మహాకవిః కాళిదాసస్య సహాధ్యాయీ పరాపాదితానాం కాళిదాసప్రబన్ధదూషణానాం పరిహర్తా యస్మిన్స్థానే తస్మాత్స్థానాదుదఙ్ముఖో, నిర్దోషత్వాదున్నతముఖః సన్ పథి సారస్వతమార్గే । దిఙ్నాగానామ్ । పూజాయాం బహువచనమ్ । దిఙ్నాగాచార్యస్య కాళిదాసప్రతిపక్షస్య హస్తవిన్యాసపూర్వకాణి దూషణాని పరిహరన్ । "అవలేపస్తు గర్వే స్యాల్లేపనే దూషణేఽపి చ" ఇతి విశ్వః । అద్రేరద్రికల్పస్య దిఙ్నాగాచార్యస్య శృఙ్గం ప్రాధాన్యమ్ । "శృఙ్గం ప్రాధాన్యసాన్వోశ్చ" ఇత్యమరః । హరతి కింస్విదితి హేతునా సిద్ధైః సారస్వతసిద్ధైర్మహాకవిభిరఙ్గనాభిశ్చ దృష్టోత్సాహః సన్ ఖముత్పతోచ్చైర్భవేతి స్వప్రబన్ధమాత్మానం వా ప్రతి కవేరుక్తిరితి । "సంసర్గతో దోషగుణా భవన్తీత్యేతన్మృషా యేన జలాశయేఽపి । స్థిత్వానుకూలం నిచులశ్చలన్తమాత్మానమారక్షతి సిన్ధువేగాత్ ।" ఇత్యేతచ్ఛ్లోకనిర్మాణాత్తస్య కవేః 'నిచుల' సంజ్ఞేత్యాహుః ॥ 14 ॥

**బ్రహ్మప్రకాశికావ్యాఖ్యా:**– పాదవిజయోత్సవమాహ – అద్రేరితి । హే శ్రీకృష్ణ! త్వం అస్మాత్ స్థానాత్ శ్రీనీలాద్రేరధిత్యకాయా నవామ్బువృష్ట్యా సరసనిచులాత్ । ఉదఙ్ముఖః గుణ్డిచా నగరస్యోదీచ్యత్వాత్ । ఖముత్పత । రథానామభ్రంలిహత్వాత్ రథనీడసింహాసనం గన్తుమాకాశమారోహేత్యర్థః త్వం కిమ్భూతః రథస్యారోహణే నీలాద్రిసింహాసనాదవరోహణే వా తావత్కాలాత్పూర్వం రమణీయస్య దర్శనార్థమున్ముఖీభిర్ముగ్ధైరభినవాగతైర్మార్గైర్వా, సిద్ధైర్జీవన్ముక్తైరఙ్గనాభిః స్త్రీభిశ్చ । "ద్వన్ద్వేఽన్తస్థపదలిఙ్గతా" । పవనః మరుదద్రేర్నీలాద్రేః, శృఙ్గం హరతి కిమ్? ఇతి హేతోశ్చకితచకితం యథా స్యాత్తథా దృష్టోచ్ఛ్రాయః, మూఢానాం అఙ్గనానాం చావివేకిత్వాత్సిద్ధానాం సమదర్శిత్వాత్తథాబుద్ధిః । ఉపరిపతనశఙ్కా భయా న్ముగ్ధాఙ్గనయోర్భయమ్ । అచలం విభుర్బ్రహ్మేతి స్వమతహానాపత్త్యా । సిద్ధానాం భయమ్। గుణసాదృశ్యే సమాసవచ్చేతద్ధి । పునః కీదృక్ । దిఙ్నాగానామిత్యాది । దిశో న న గచ్ఛన్తీతి దిఙ్నాగాః । పాదవిజనకారిణో దేవలకాః । తే హి ధనార్జనాయ దిశో గచ్ఛన్తి స్వస్థానే జలక్షేత్రాభావాత్ । నఞోనుత్తరపదరూపత్వాపత్వన్న భవతి న శబ్దో వా । వలవన్తశ్చే ఽ తస్తేషాం ఆనయనసమయే స్థూలైః హస్తైరవలేపాన్ గర్వజన్యక్షేపణాదీన్ పథి పరిహరన్ వఞ్చయన్ ముగ్ధః సౌమ్యేనవే మూఢే (?) ॥ 14 ॥

**విద్యుల్లతావ్యాఖ్యా:**– అథ ప్రతిజ్ఞాతం మార్గకథనమారభతే -- అద్రేః శృఙ్గమితి । అస్యేతి లభ్యతే, 'స్థానాదస్మాత్' ఇత్యుక్తేః । శృఙ్గం న తు శిలామాత్రమ్ । ఏతేన తుఙ్గత్వవిస్తృతత్వోక్తిః కిం స్విదితి । కింశబ్దో వికల్పే । స్విచ్ఛబ్దః ప్రశ్నే । 'క్షేపే వికల్పే కిమ్' ఇతి, 'ప్రశ్నే వికల్పే ను స్విచ్చ' ఇతి వైజయన్తీ ఉన్ముఖీభిః ఉన్నమితవదనాభిః । చకితచకితం అతిభయవివశమ్ । గగనశిరసి కిమిదమనిలబలచలితమవనిధరశిఖరమ్, అపరముత కిమపి బృహదితి సరభసముపరిపరిపతనభయభరతరలనయనకువలయమనిభృతకుచముకులమభిరుచి తజనమనుయుఞ్జానాభిరిత్యర్థః అత్ర హేతుః–ముగ్ధాభిః అనతినిర్భరయౌవనాభరణత్వాద

విదితవస్తుతత్త్వాభిః, సిద్ధాః ఖడ్గగులికాఞ్జనాదిధారిణో దేవయోనివిశేషాః తేషాం వధూభిః। సిషాధయిషితకార్యోద్యోగభారః ఉత్సాహః । అనేన త్రాసశఙ్కావిస్మయౌత్సుక్యతరఙ్గిత వివిధవిలాసభఙ్గీరఙ్గాణాం దివిచరాఙ్గనాపాఙ్గానాం ప్రథమత ఏవ భాజనం భవిష్యతీత్యహో ప్రథమఖనన ఏవ నిధిదర్శనమితి ద్యోత్యతే । సరసనిచులాత్ విమలసలిలబహులతయా సతతతరుణవేతసతరువిశేషాత్। 'నిచులో హిజ్జలోఒమ్బుజః' ఇత్యమరః । ఏతచ్చ మదజల నిఘరోద్గారమణ్డితగణ్డమణ్డలతయా చణ్డతాపవినోదనాయ శీతలతమమముం ప్రదేశ ముద్దిశ్య తేషామాగమనం సమ్భావ్యత ఇతి వ్యఞ్జయతి, ఇదానీమత్ర వృష్టిర్నాపేక్షితా, తత్ గమన ఏవోద్యుజ్యతామితి వా, త్వత్కృతేదానీన్తనవర్షనవీకృతతరుతయా యావ దాగమనమిహ న శోషశఙ్కేతి వా । సముత్పతేతి । సకలదేశదర్శనసౌకర్యాయ గగనశిఖర మారోహేత్యర్థః । దిజ్ నాగానామ్ ఐరావతాదీనామ్, బహుభిరేకస్య విరోధో న యుక్తోఒ పనయత్వాదితి భావః । ఏతేన సమరకాతరత్వశఙ్కామస్య పరిహరతి । పథి పరిహరన్నితి। తదాఘాతశఙ్కాయామపథేనాపి గన్తవ్యమితి భావః । స్థూలహస్తావలేపాన్ ప్రతిగజధియా సమరాయ వా, గిరితటబుద్ధ్యా వప్రక్రీడనార్థం వా, సమాక్రష్టుం ప్రసరతాం మహతాం శుణ్డాదణ్డానాం మదభరజనితాన్ యత్కిఞ్చిత్కారితాలక్షణాన్ వ్యాపారాన్, యథా కుమార సమ్భవే – 'తదీయాస్తోయదేష్వద్య పుష్కలావర్తకాదిషు । అభ్యస్యన్తి తటాఘాతం నిర్జితైరావతా గజాః' ఇతి । అత్ర ప్రథమపాదే సన్దేహాలఙ్కారః । అన్యత్ర స్వభావోక్తిః ॥ 14 ॥



**శ్లో॥ రత్నచ్ఛాయావ్యతికర ఇవ ప్రేక్ష్యమేతత్పురస్తా**
**ద్వల్మీకాగ్రాత్ప్రభవతి ధనుష్ఖణ్డమాఖణ్డలస్య।**
**యేన శ్యామం వపురతితరాం కాన్తిమాపత్స్యతే తే**
**బర్హేణేవ స్ఫురితరుచినా గోపవేషస్య విష్ణోః॥ 15**

**- మృణాలినీ వ్యాఖ్యా -**

**పదవిభాగము:-** రత్న–చ్ఛాయా–అవ్యతికరః, ఇవ, ప్రేక్ష్యమ్, ఏతత్, పురస్తాత్, వల్మీక+అగ్రాత్, ప్రభవతి, ధనుః+ఖణ్డమ్, ఆఖణ్డలస్య। యేన, శ్యామమ్, వపుః, + అతితరామ్, కాన్తిమ్,+ఆపత్స్యతే,తే బర్హేణ, +ఇవ, స్ఫురిత–రుచినా, గోపవేషస్య, విష్ణోః॥

**ప్రతిపదార్థము:-** హే మేఘ! – ఓ మేఘుడా!

రత్న–చ్ఛాయా–అ వ్యతికరః ఇవ=పద్మరాగాది మణుల కాన్తుల కలయిక వలె
ప్రేక్ష్యమ్ = చూడదగిన,
ఆఖణ్డలస్య = ఇంద్రునియొక్క,
ఏతత్ ధనుః+ఖణ్డమ్ = ఈ ధనుస్సుయొక్క భాగము (వరదగుడి భాగము),
పురస్తాత్ = ఎదుటనున్న,
వల్మీక+అగ్రాత్ = రామగిరి పర్వతాగ్రమునుండి,

| | |
|---|---|
| **ప్రభవతి** | = పుట్టుచున్నది. |
| యేన | = ఏ వరదగుడిచే, |
| తే | = నీ యొక్క |
| శ్యామమ్ | = నల్లని, |
| వపుః | = శరీరము, |
| స్ఫురితరుచినా | = ఉజ్జ్వల కాన్తిగల, |
| బర్హేణ | = పింఛముతో నున్న, |
| గోపవేషస్య విష్ణోః | = గోపాలకృష్ణుని యొక్క |
| అతితరామ్ | = మిక్కిలి |
| కాన్తిమ్ | = శోభను |
| **ఆపత్స్యతే** | = పొందగలదో. |

**తాత్పర్యము:-** ఓ మేఘుడా! పద్మరాగాది మణుల కాన్తుల కలయిక వలె చూడదగిన వరదగుడి భాగము ఎదుటనున్న **రామగిరి** పర్వతాగ్రమునుండి పుట్టుచున్నది. ఏ వరదగుడిచే నీ నల్లని శరీరము, ఉజ్జ్వలకాన్తిగల, పింఛముతోనున్న గోపాలకృష్ణునియొక్క అధిక శోభను పొందగలదు.

**- పదాదర్శః -**

**1) విభక్తులు-అవ్యయములు-కృత్తులు-క్రియలు:-**

రత్న....వ్యతికరః-(ప్ర.ఏ.), ఇవ-(అవ్య.), ప్రేక్ష్యమ్-(ప్ర.ఏ.), ఆఖణ్డలస్య- (ష.ఏ.), ఏతత్-(ప్ర.ఏ.), ధనుష్ఖణ్డమ్-(ప్ర.ఏ.), పురస్తాత్-(అవ్య.), వల్మీకాగ్రాత్ -(పం.ఏ.), ప్రభవతి-(క్రియ), యేన-(తృ.ఏ.), తే-(ష.ఏ.), శ్యామమ్-(ప్ర.ఏ.), వపుః-(ప్ర.ఏ.), స్ఫురితరుచినా-(తృ.ఏ.), బర్హేణ-(తృ.ఏ.), గోపాలవేషస్య -(ష.ఏ.), విష్ణోః-(ష.ఏ.), అతితరామ్-(అవ్య.). కాన్తిమ్-(ద్వి.ఏ.), ఆపత్స్యతే - క్రియ.

**2) సమాసములు:-**

అ) రత్నానాం ఛాయాః రత్నచ్ఛాయాః (ష.త.), ఆసమన్తతాత్ వ్యతికరః, ఆ వ్యతికరః తేషాం అవ్యతికరః (ష.త.), రత్నచ్ఛాయావ్యతికరః.

ఆ) వల్మీకస్య అగ్రమ్, వల్మీకాగ్రమ్, తస్మాత్, వల్మీకాగ్రాత్ (ష.త.)

ఇ) ధనుషః ఖణ్డమ్ - ధనుష్ఖణ్డమ్ (ష.త.)

ఈ) గోపానాం వేషః, గోపవేషః (ష.త.), తస్య గోపవేషస్య / గాం పాతీతి గోపః.

ఉ) స్ఫురితా రుచిః యస్య తత్, స్ఫురితరుచిః (బహువ్రీహిః), తేన, స్ఫురితరుచినా.

**3) పాఠాంతరములు:-** 1) రత్నచ్ఛాయావ్యతికరః > రత్నచ్ఛాయవ్యతికరః,
2) ఆపత్స్యతే > ఆలప్స్యతే.

**4) పదవ్యుత్పత్తి-నిఘంటుప్రమాణములు-కావ్యప్రయోగములు:-**

**అ) రత్నచ్ఛాయావ్యతికర ఇవ :**

1. "వజ్రం ముక్తా ప్రవాళం చ గోమేదశ్చేన్ద్రనీలకః వైదూర్యం
పుష్యరాగశ్చ పాచిర్మాణిక్యమేవ చ మహారత్నాని చైతాని".

(వజ్రము-ముత్యము-పగడము-గోమేధికము-ఇంద్రనీలము-వైఢూర్యము-పుష్యరాగము-మరకతము-మాణిక్యము) అనునవి నవమహారత్నములు.

2. **రత్నమ్**- ఉణాదిసూత్రమ్ (3-14) - రమేస్త చ। రత్నమ్.

**వృత్తిః** - ణన్నాద్ రమేర్న్రప్రత్యయో యస్య తశ్చాదేశః। రమయతి హర్షయతీతి **రత్నమ్**।"జాతౌ జాతౌ యదుత్కృష్టం తద్ధి రత్నం ప్రచక్షతే!" అశ్వరత్నమ్, గజరత్నమ్, మణిరత్నమ్, స్త్రీరత్నమ్ ఇత్యాది. -భగవత్పాద శ్రీదయానందసరస్వతిస్వామివారు.

అ) **ఆఖణ్డలస్య** - 1) (i) ఆఖణ్డలః - ఆఙ్+ఖణ్డ్+కలచ్ - ఇంద్రః.

(ii) శ్లో॥ *ఇన్ద్రో దుశ్చ్యవనో హరిః సురపతిః సఙ్క్రన్దనో వాసవో*
*వృత్రారిర్బలసూదనః శతమఖో వృద్ధశ్రవాః కౌశికః।*
*జిష్ణుర్వజ్రధరః సహస్రనయనో వాస్తోష్పతిర్గోపతిః*
*పర్జన్యో మఘవా వృషా హరిహయః ప్రాచీనబర్హిః స్మృతః॥* (52)

శ్లో॥ *పురుహూతః పృతనాషాట్ పురన్దరః పూర్వదిక్పతిః స్వారాట్।*
***ఆఖణ్డల** స్తురాషాట్ సుత్రామా గోత్రభిత్సునాసీరః॥* (53)

శ్లో॥ *శక్రః స్యాదుగ్రధన్వా చ హరివాన్పాకశాసనః।*
*దివస్పతిర్ద్విడౌజాశ్చ మరుత్వాన్మేఘవాహనః ॥* (54)

- అని హలాయుధకోశము 39 పేర్లను పేర్కొన్నది.

2) (i) ఆఖణ్డయతి భేదయతి పర్వతాన్, ఖణ్డ్-డలచ్-డస్య నేత్వమ్ -అని వాచస్పత్యము.

(ii) శ్లో॥ *అథోరుదేశాదవతార్యపాద-మాక్రాన్తిసమ్భావితపాదపీఠమ్।*
*సఙ్కల్పితార్థే వివృతాత్మశక్తి-**మాఖణ్డలః** కామమిదం బభాషే॥*-కు.సం. 3.11

'ఇంద్రుడు, శివుని చిత్తమును ఆకర్షించు విషయమునందు తన సామర్థ్యమును తెలిపిన మన్మథునితో, ఈ విధముగ మాట్లాడుట మొదలిడెను.'

ఇ) **ధనుష్ఖణ్డమ్** - ఇది సరియైనరూపముగ భావింపవలయును.

1) *'నిత్యం సమాసే౽నుచర పదస్థస్య'* - అని అష్టాధ్యాయీ. 8-3-45.

2) శ్లో॥ *సూర్యస్య వివిధాః వర్ణాః పవనేన విఘట్టితాః సాభ్రే।*
*వియతి ధనుః సంస్థానా యే దృశ్యన్తే తదిన్ద్రధనుః॥*
- బృహత్సంహితా - వరాహమిహిరాచార్యులు.

3) "ఇంద్రచాపం కిల వల్మీకాన్తవ్యవస్థితమహానాగశిరోమణికిరణసమూహాత్సముత్పద్యతే। వాసుకి ఫణామణిగణద్యుతిర్వల్మీకరన్ధ్రన్నిఃసృత్య నభసి మేఘే శక్రధనురాకారమాపాద్యత ఇత్యాగమః।" - 'సారోద్ధారిణి'- 'భరతుడు' పేర్కొనినారు.

ఈ) వల్మీకాగ్రమన-రామగిరి పర్వతాగ్రమని Practical Sanskrit Dictionary పేర్కొనినది.

**5) క్రియారూపములు:-** 1) ప్రభవతి-పూర్వము చెప్పబడినది, 2) **ఆపత్స్యతే**-ఆఙ్ ఉపసర్గ.

2) పద (పద్)-గతౌ (నడచుట, వెళ్ళుట). ది.ప్ర., సకర్మకమ్, అనిట్, ఆత్మనేపదీ. లృట్-ప్రథమపురుషైకవచనమ్, **ఆపత్స్యతే**-ఆపత్స్యేతే-ఆపత్స్యన్తే.

**6) అలంకారములు:-** శ్లోక ప్రథమచతుర్థపాదముల శ్రౌతీ ఉపమాద్వయము. సాక్షాత్ సాదృశ్య ప్రతిపాదకయథేవాది శబ్దప్రయోగముచే శ్రౌతి. నిరపేక్ష స్థితి చేత 'సంసృష్టి యలంకారము' చెప్పదగును.

లక్షణమ్:- ***వరా విభూషా సంసృష్టిర్బహ్వాలఙ్కారయోగతః।***
***రచితా రత్నమాలేవ సా చైవ ముదితా యథా ॥*** *113-49*

'అనేక రత్నములను కూర్చి గ్రుచ్చిన రత్నమాలవలె, అనేకములైన అలంకారముల సంబంధముచే ఏర్పడిన సంసృష్టి ఉత్తమమైన అలంకారము. - కా.ప్ర. - బాలానందినీవ్యాఖ్యా

**సఞ్జీవినీవ్యాఖ్యా:-** రత్నేతి । రత్నచ్ఛాయానాం పద్మరాగాదిమణిప్రభాణాం వ్యతికరో మిశ్రణమివ ప్రేక్ష్యం దర్శనీయమాఖణ్డలస్యేన్ద్రస్యైతద్ధనుష్ఖణ్డమ్ । 'ఏతత్' ఇతి హస్తేన నిర్దేశో వివక్షితః। పురస్తాదగ్రే వల్మీకాగ్రాద్వామలూరువివరాత్। "వామలూరుశ్చ నాకుశ్చ వల్మీకం పుంనపుంసకమ్" ఇత్యమరః । ప్రభవత్యావిర్భవతి । యేన ధనుష్ఖణ్డేన తే తవ శ్యామం వపుః । స్ఫురితరుచినోజ్జ్వలకాన్తినా బర్హేణ పిచ్ఛేన । "పిచ్ఛబర్హే నపుంసకే" ఇత్యమరః । గోపవేషస్య విష్ణోర్గోపాలస్య కృష్ణస్య శ్యామం వపురివ । అతితరాం కాన్తిం శోభామాపత్స్యతే ప్రాప్స్యతే ॥ 15 ॥

**బ్రహ్మప్రకాశవ్యాఖ్యా:-**రథారోహానన్తరమగ్రతః ఐన్ద్రం ధనుః దృష్ట్వాహ-రత్నచ్ఛాయా వ్యతికర ఇవేతి । హే శ్రీకృష్ణ! పురస్తాదగ్రతః। రత్నానాం మాణిక్యాదినానావర్ణమణీనాం ఛాయావ్యతికర ఇవ। కాన్తిసమూహ ఇవ ప్రేక్షణీయం సున్దరతమమేతదాఖణ్డలస్య ధనుషః ఖణ్డం వల్మీకాగ్రాత్ ప్రభవతి। యేన విష్ణోస్తే తవ శ్యామం వపురతితరాం కాన్తిమాపత్స్యతే। స్ఫురితరుచినా బర్హేణ గోపవేషస్య భావిని కలౌ యుగే కృష్ణావతారం విధాయ వృన్దావనే విహరిష్యతస్తవేవ ॥ 15 ॥

**విద్యుల్లతావ్యాఖ్యా:-** అథ మధ్యేమార్గకథనం గమనసమయే ప్రశస్తం దైవత ఏవోపపన్నం కిమపి మఙ్గలమవలోక్య తదుద్దర్శనాయాహ-రత్నేతి । రత్నచ్ఛాయావ్యతికరః వ్యామిశ్రితానాం వజ్రాదీనాం విచిత్రాణాం నవానాం రత్నానాం సఙ్కీర్ణః ప్రభాప్రరోహ సన్దోహ ఇవేత్యర్థ, ఇన్ద్రధనుషో నానావర్ణత్వాత్ । ప్రేక్ష్యం పురస్తాత్ అగ్రతో భవతా దృష్టిర్దేయేత్యర్థః। అథవా దర్శనీయమితి ధనుషో విశేషణమ్। వల్మీకాగ్రాదపి పాకశాసన శరాసనోదయ ఇతి ప్రసిద్ధిః। ఉక్తం చ సంహితాయామ్ -- 'జలమధ్యేఽనావృష్టిర్భువి సస్యవధస్తరూత్థితే వ్యాధిః। వల్మీకే శస్త్రభయం నిశి సచివవధాయ ధనురైన్ద్రమ్' ఇతి। ఖణ్డం అపూర్ణస్వరూపమ్, ఉత్పద్యమానదశాకత్వాత్। ఆఖణ్డలః ఇన్ద్రః। అతితరామితి। పూర్వమేవ నయనహారి, ఏతత్సాహిత్యే కిమ్పునరితి భావః। బర్హేణేతి। జాతావేకవచనమ్।

ప్రాలమ్బ్యాత్మనా గ్రథితైర్మయూరపిఞ్ఛైరిత్యర్థః, తేషామపి శబలవర్ణాత్వాత్ । స్ఫురితరుచినా శుద్ధశ్యామలే వపుషి శబలవర్ణస్య పరభాగలాభాత్ విభక్తోల్లసితలావణ్యేన । శ్యామమితి స్ఫురితరుచినేతి చ సాధారణో ధర్మః । గోపవేషస్య వల్లవానాం వేష ఇవ వేషో యస్య । ఆకల్పస్య కల్పనా వేషః । అనేన ధరణితలమవతీర్ణస్య పూర్ణాత్మనః పద్మనాభస్య కర్మబన్ధనిబన్ధనమన్తరేణైవ ధర్మసంస్థాపనాయ నటస్యేవ తత్తద్భూమికావలమ్బేన వివర్త, న తు వాస్తవః కశ్చిద్విగ్రహపరిగ్రహ ఇతి ద్యోత్యతే, 'జగతాముపకారాయ న సా కర్మనిమిత్తజా । చేష్టా తస్యాప్రమేయస్య వ్యాపిన్యవ్యాహతాత్మికా' ఇతి వచనాత్ । విష్ణోః వ్యాప్తత్వేన వేదశిరసి ప్రతిపాద్యమానస్య, 'వేదాన్తవేదిభిర్విష్ణుః ప్రోచ్యతే యో నతోऽస్మి తమ్' ఇతి వచనాత్ । అత్ర భగవత ఉపమానత్వాత్ ఉపమేయస్యాపి మేఘస్య సఙ్కోచవికాసశక్తత్వం స్వరసత ఏవ పరోపకారపరత్వం చ ద్యోత్యతే । 'తే' ఇతి కేవలమేఘస్యైవోపమేయత్వేన గోపవేషస్యేతి ధర్మాధిక్యమితి నాశఙ్కనీయమ్, తస్యైవ బర్హధారణోపపత్తేస్తద్విశిష్టస్యైవ విష్టరశ్రవస ఉపమానత్వాత్, శ్రీరామాయణే -- 'సుప్తైకహంసం కుముదైరుపేతం మహాహ్రదస్థం సలిలం విభాతి। శరత్ప్రసన్నం పరిపూర్ణచన్ద్రం తారాగణాకీర్ణమివాన్తరిక్షమ్ ॥' ఇత్యత్ర మహాహ్రదస్థమితివత్। ఉపమాత్రాలఙ్కారః । కస్యచిద్రాజ్ఞః ప్రస్థానారమ్భే కుతశ్చిత్పురుషాదనర్ఘరత్నాభరణోపహార ప్రాప్తిసమాధిరత్రానుసన్ధేయః। ఇన్ద్రధనుషో దర్శనస్య యాత్రాయాం మఙ్గలత్వముక్తమ్ । తథా చ మహాయాత్రాయామ్ -- 'చాపమైన్ద్రమనులోమమఖణ్డం ప్రోజ్జ్వలం బహలమాయ -తమిష్టమ్' ఇతి ॥ 15 ॥



శ్లో॥ త్వయ్యాయత్తం కృషిఫలమితి భ్రూవికారానభిజ్ఞైః
ప్రీతిస్నిగ్ధైర్జనపదవధూలోచనైః పీయమానః।
సద్యః సీరోత్కషణసురభి క్షేత్రమారుహ్య మాలం
కిఞ్చిత్పశ్చాద్వ్రజ లఘుగతిర్భూయ ఏవోత్తరేణ॥ 16

**- మృణాలినీ వ్యాఖ్యా -**

**పదవిభాగము:-** త్వయి,+ఆయత్తమ్, కృషి-ఫలమ్, ఇతి, భ్రూ-వికార+అనభిజ్ఞైః, ప్రీతి-స్నిగ్ధైః,+జనపద-వధూ-లోచనైః, పీయమానః।
సద్యః సీర+ఉత్కషణసురభి, క్షేత్రమ్, ఆరుహ్య, మాలమ్, కిఞ్చిత్,+పశ్చాత్,+వ్రజ, లఘు-గతిః, భూయః, ఏవ,+ఉత్తరేణ।

**ప్రతిపదార్థము:-** హే మేఘ! - ఓ మేఘుడా!

కృషి-ఫలమ్ = సేద్యఫలమైనపంట,
త్వయి = నీయందు,
ఆయత్తమ్ = ఆధారపడినది,

| | |
|---|---|
| ఇతి | = అని, |
| ప్రీతి-స్నిగ్ధైః | = ప్రేమార్ద్రములును, |
| భ్రూ-వికార+అనభిజ్ఞైః | = కనుబొమముడిపాటులను తెలియని, |
| జనపద-వధూ-లోచనైః | = పల్లెపడుచుల కన్నులచేత, |
| పీయమానః (సన్) | = ఆప్యాయముగ చూడబడినవాడవగుచు, |
| మాలమ్ | = 'మాల' యని ప్రసిద్ధి చెందిన, |
| క్షేత్రమ్ | = ఉన్నత సమతలమును, |
| సద్యః | = ఆ క్షణమున, |
| సీర+ఉత్కషణసురభి(యథాతథా)= | నాగళ్ళచేత దున్నుటచే పరిమళముట్టిపడునట్లుగా, |
| ఆరుహ్యా | = ఎక్కి (అభివర్షించి) |
| కిఞ్చిత్ | = కొంచెము, |
| పశ్చాత్ | = పశ్చిమముగ, |
| వ్రజ | = పొమ్ము, |
| భూయః | = మరల, |
| లఘు-గతిః (సన్) | = శీఘ్రగమనము గలవాడవగుచు, |
| ఉత్తరేణ ఏవ | = ఉత్తర దిక్కుగనే, |
| వ్రజ | = పొమ్ము. |

**తాత్పర్యము:-** ఓ మేఘుడా! 'సేద్యఫలమైన పంట నీ యందు ఆధారపడినది' అని ప్రేమార్ద్రములును, కనుబొమముడిపాటులును తెలియని పల్లెపడుచుల కన్నులచేత ఆప్యాయముగ చూడబడిన వాడవగుచు, 'మాల' యని ప్రసిద్ధిగల ఉన్నత సమతలమును, ఆ కాలమందే నాగళ్ళచేత దున్నుటచే పరిమళముట్టిపడునట్లుగా వర్షించి కొంచెము పశ్చిమముగా పొమ్ము. మరల శీఘ్రగమనమున ఉత్తరదిక్కుగనే పొమ్ము.

**- పదాదర్శః -**

**1) విభక్తులు-అవ్యయములు-కృత్తులు-క్రియలు:-**

కృషిఫలమ్-(ప్ర.ఏ.), త్వయి-(స.ఏ.), ఆయత్తమ్-(ప్ర.ఏ.), ఇతి-(అవ్య.), ప్రీతిస్నిగ్ధైః -(తృ.బ.), భ్రూ...భిజ్ఞైః-(తృ.బ.), జన...లోచనైః-(తృ.బ.), పీయమానః-(ప్ర.ఏ.), మాలమ్-(ద్వి.ఏ.), క్షేత్రమ్-(ద్వి.ఏ.), సద్యః-(అవ్య.), సీర...సురభి- (ప్ర.ఏ.), ఆరుహ్యా-(కృత్తు), కిఞ్చిత్-(అవ్య.), పశ్చాత్-(అవ్య.), వ్రజ- (క్రియ), భూయః -(అవ్య.), లఘుగతి-(ప్ర.ఏ.), ఉత్తరేణ-(అవ్య.), ఏవ-(అవ్య.)

**2) సమాసములు:-**

అ) కృషేః ఫలమ్, కృషిఫలమ్ (ష.త.)

ఆ) భ్రువః విలాసః, భ్రూవిలాసః (ష.త.), తేభ్యః అనభిజ్ఞైః, భ్రూవిలాసానభిజ్ఞైః (ష.త.)

ఇ) ప్రీత్యా స్నిగ్ధైః, ప్రీతిస్నిగ్ధైః (తృ.త.).

ఈ) జనపదస్య వధూః, జనపదవధూః, (ష.త.), తాసాం లోచనాని, జన...లోచనాని, (ష.త.), తైః, జనపదవధూలోచనైః.

ఉ) సీరైః ఉత్కషణం (తృ.త.), తేన సురభి, (తృ.త.), తద్ యథా తథా-క్రియావిశేషణమ్

**3) పాఠాంతరములు:-** 1) భ్రూవిలాసానభిజ్ఞైః > భ్రూవికారానభిజ్ఞైః, 2) సురభి క్షేత్రమ్ >సురభిక్షేత్రమ్, 3) వ్రజ లఘుగతిః>ప్రవలయగతిమ్, 4) కిఞ్చిదేవ>భూయ ఏవ.

**4) పదవ్యుత్పత్తి-నిఘంటుప్రమాణములు-కావ్యప్రయోగములు:-**

అ) **భ్రూవికారానభిజ్ఞైః :-** "గ్రామ్యత్వాత్ భ్రూవిభ్రమాచతురైః న తు ప్రీతేరభావాత్।" - అని 'వల్లభుడు', 'సుమతి', 'సారోద్ధారిణి' లు.

ఆ) **ప్రవలయ గతిమ్ -** "గతిం ప్రవలయ వ్యావర్తయ। మాలం హి దక్షిణాశాస్థం తేన చోత్తరాశా గన్తవ్యేతి గతి ప్రవలనమ్" - అని వల్లభదేవుడు.

ఇ) **...లోచనైః పీయమానః -**

*శ్లో॥ తమేకదృశ్యం నయనైః పిబన్త్యో-నార్యో న జగ్ముర్విషయాన్తరాణి।*
*తథాపి శేషేన్ద్రియవృత్తిరాసాం-సర్వాత్మనా చక్షురివ ప్రవిష్టా॥* - కు.సం.7-64

శివుడు, హిమవన్నగర ప్రవేశమున - పురసుందరీమణుల విలాసచేష్టితములు- "ఒకే ఒక దర్శనీయుడైన ఆ స్వామిని (శివభగవానుని) తమ నేత్రములతోనే ఆత్రముగ త్రాగివేయుచు ఇతర విషయములను ఆ స్త్రీలు గ్రహించక మైమరచి పోయిరి. ఆ సుందరీమణుల సర్వేంద్రియవ్యాపారములూ వారి నేత్రములోనికి ప్రవేశించినవేమో అన్నట్లుగ నుండెను".

ఈ) **మాలమ్**-'మాలమన ఉన్నత సమతలము' ఇచట వైవిధ్యమున్నట్లు గమనించగలరు.

1) "It is not easy after the lapse of ages to ascertain precisely the site of several places enumerated in the poem before us. The easterly progress of the cloud, and the subsequent direction by which he is to reach the mountain Amrakuta, prove that the place here mentioned must be somewhere in the vicinity of Ratnapur, the chief town of the northern half of the province of Chattisgad"- Wilson.

2) "Here Mallinatha's sense is better, as the cloud would like to ascend an elevated spot rather than a district." - Kale.

3) తొలకరిలో భూమిని దున్నడం వలన, ఆ సమయంలో మేఘుడు వర్షించడం వల్ల భూమి సువాసనలను వెదజల్లుతుంది.

*"తత్ర ద్రవ్యాణి పృథివ్యప్తేజోవాయ్వాకాశకాలదిగాత్మమానాంసి నవైవ।"*
*'తత్ర గన్ధవతీ పృథివీ'* అని తర్కశాస్త్రము పేర్కొన్నది.

'పృథివీ పృథవీ పృథ్వీ' ఇతి శబ్దార్ణవః। అని సుధావ్యాఖ్యానమ్ పేర్కొన్నది.

**5) క్రియారూపము:-** 1) వ్రజ

వ్రజ్ - గతౌ (వెళ్ళుట), భ్వాదిప్రకరణమ్, సకర్మకమ్, సేట్, పరస్మైపదీ. లోట్-మధ్యమపురుషైకవచనమ్, **వ్రజ/వ్రజతాత్**-వ్రజతమ్-వ్రజత.

**6) అలంకారములు:-** 'పరివృత్త్యలఙ్కారము'. లక్షణమ్:-

కా॥ *విశిష్టస్య యదాదానమన్యాపోహేన వస్తునః*
*అర్థాన్తరన్యాసవతీ పరివృత్తి రసౌ యథా॥* - కావ్యాలఙ్కారః-3.41 (బాలానందినీవ్యాఖ్యా)

'విశిష్టము కాని దానిని విడచి విశిష్టమైన వస్తువును గ్రహించుట పరివృత్త్యలఙ్కారము. ఈ అలఙ్కారము అర్థాన్తరన్యాసముతో కలిసియుండును.' శ్లోక పూర్వార్ధము, ఉత్తరార్ధముచే సమర్థింపబడుటచే అర్థాన్తరన్యాసము.

**సఞ్జీవినీవ్యాఖ్యా:-** త్వయీతి। కృషేర్హలకర్మణః ఫలం సస్యం త్వయి। అధికరణవివక్షాయాం సప్తమీ। ఆయత్తమధీనమ్। "అధీనో నిఘ్న ఆయత్తః" ఇత్యమరః॥ ఇతి హేతోః ప్రీత్యా స్నిగ్ధైః, అకృత్రిమప్రేమార్ద్రైరిత్యర్థః॥ భ్రూవిలాసానాం భ్రూవికారాణాం అనభిజ్ఞైః; పామరత్వాదితి శేషః॥ జనపదవధూనాం పల్లీయోషితాం లోచనైః పీయమానః సాదరం వీక్ష్యమాణః సన్। మాలం మాలాఖ్యం క్షేత్రం శైలప్రాయమున్నతస్థలమ్। "మాలమున్నత భూతలమ్" ఇత్యుత్పలమాలాయామ్। సద్యస్తత్కాలమేవ సీరైర్హలైరుత్కషణేన కర్షణేన సురభి ఘ్రాణతర్పణం యథా తథా ఆరుహ్య,తత్రాభివృష్యేత్యర్థః॥'సురభిర్ఘ్రాణ తర్పణః' ఇత్యమరః। కిఞ్చిత్పశ్చాల్లఘుగతిస్తత్ర నిర్వృష్టత్వాత్క్షిప్రగమనః సన్। "లఘు క్షిప్రమరం ద్రుతమ్" ఇత్యమరః। భూయః పునరపి, ఉత్తరేణైవోత్తరమార్గేణైవ వ్రజ గచ్ఛ॥ తృతీయావిధానే "ప్రకృత్యాదిభ్య ఉపసఙ్ఖ్యానమ్" (వా.1466) ఇతి తృతీయా॥ "క్షేత్రం శరీరే కేదారే సిద్ధస్థానకలత్రయోః" ఇతి విశ్వః॥ యథా కశ్చిద్బహువల్లభః పతిః కుత్రచిత్క్షేత్రే కలత్రే గూఢం విహృత్య దాక్షిణ్య భఙ్గభయాన్నీచమార్గేణ నిర్గత్య పునః సర్వాధ్యక్ష ఇవ సఞ్చరతి తద్వదితి ధ్వనిః॥ 16 ॥

**బ్రహ్మప్రకాశికావ్యాఖ్యా:-** త్వయ్యాయత్తమితి॥ హే శ్రీకృష్ణ! త్వమారూహ్య రథమితి శేషః॥ లఘుగతిర్వ్రజ। అలమత్యర్థం మా న (?) వ్రజ। కిమర్థం తత్రాహ - పశ్చిమస్యాం పర్వతస్యాసన్నత్వాన్నజనవహత్వముత్తరస్యాం తు సన్తి॥ త్వం కిం భూతః॥ పశ్చాత్ పశ్చిమస్యాం దిశి కిఞ్చిదల్పం యథాస్యాత్తథా॥ ఉత్తరేణ భూయ ఏవ క్షేత్రం ధాన్యోత్పత్తి స్థానం సద్యః సీరోత్కర్షణేన లాఙ్గలప్రహత్యా సురభి, అభివ్యాప్య। కృషిఫలం త్వయ్యాయత్తం త్వయి ప్రసన్న ఏవ కృషిఫలమన్యథా_నావృష్ట్యతివృష్ట్యాదిభిః న కిఞ్చిద్భవతి ఇతి హేతోః ప్రీతిస్నిగ్ధైః। భ్రూవికారానభిజ్ఞైరనాగరత్వాత్। ఈదృశైర్జనపదబధూనాం లోచనైః పీయమానః సాకాంక్షమీక్ష్యమాణః। తాసాం దర్శనాభిలాషసమాప్త్యర్థం శనైర్వ్రజేతిభావః॥ జన్మ జన్మయదభ్యస్తం ఇత్యత్రోపచరితకాలవత్క్షేత్రమిత్యత్రాప్యుపవరితా- ధ్యత్వాత్కాలాధ్వభ్యా మవిచ్ఛేద ఇతి ద్వితీయా (?)॥ 16 ॥

**విద్యుల్లతావ్యాఖ్యా:-** పునః ప్రకృతమనుసరతి -- త్వయీతి। కృషిఫలం కృషిః క్షేత్రసంస్కార బీజావాపాదికో వ్యాపారః, తస్య ఫలం సమ్పూర్ణసస్యసమ్పత్తిః తత్। త్వయి, అధీనం పరాపేక్షయా స్థితమ్, తస్య సముచితసమయసమ్భవివిశిష్టవృష్టినిష్పాద్యత్వాత్। ఇతి

శబ్దో హేతౌ। భ్రూవిలాసానభిజ్ఞైః అరేచితప్రభృతీనాం భ్రూచేష్టితానామకోవిదైః, ఉపలక్షణం చైతదన్యేషామపి నయనవిలాసానామ్, నగరసున్దరీనయనారవిన్దవత్ కృత్రిమవిలాస విరచనాస్వశిక్షితైరిత్యర్థః। ఏతేన స్వారసికవిలాసైరేవ తేషాం సహృదయచమత్కారకారిత్వం ధ్వనితమ్। **'అలసవలితైః ప్రేమార్ద్రార్ద్రైర్ముహుర్ముకులీకృతైః క్షణమభిముఖైర్లజ్జాలోలైర్నిమేష పరాఙ్ముఖైః। హృదయనిహితం భావాకూతం వమద్భిరివేక్షితైః కథయ సుకృతీ కోఽయం ముగ్ధే త్వయాద్య విలోక్యతే॥'** ఇతి ముగ్ధానామప్యకృత్రిమవిలాససమ్ప్రత్పతిపాదనాత్। తథా కిరాతే -- **'అకృత్రిమప్రేమరసాభిరామం రామార్పితం దృష్టివిలోభి దృష్టమ్'** ఇతి। **'పుంసః పూర్వాపరీభూతా సుఖిత్వేన వ్యవస్థితిః। బుద్ధేరున్మీలనీ గాఢం ప్రీతిత్వేన నిగద్యతే॥'** ఇతి దివాకరః। స్నిగ్ధైః అరూక్షైః। జనపదవధ్వః రాష్ట్రాణాం కృషీవలబహులతయా అర్థాత్తన్నివాసికృషీవలమహిలాః। పీయమానః స్నేహబహుమానౌత్సుక్యాతిరేకజనితేన దర్శనేన కబలీక్రియమాణః। సద్యః సీరోత్కషణసురభి సమనన్తరమేవ హలముఖోల్లిఖితేషు ధర్మతప్తేషు ప్రదేశేషు త్వదుపగమజనితనవవర్షావసేకాత్ ఘ్రాణేన్ద్రియప్రీణనగన్ధయుక్తమ్। 'అథో ఫలమ్। నిరీషం కూటకం ఫాలః కృషికో లాఙ్గలం హలమ్। గోదారణం చ సీర' ఇత్యమరః, 'సురభిర్ఘ్రాణతర్పణః' ఇతి చ। క్షేత్రం కేదారబహులత్వాత్ పుణ్యదేశత్వాద్వా 'క్షేత్రం గృహే పురే దేహే కేదారే యోగిభార్యయోః। పుణ్యస్థానే సమూహే చ' ఇతి వైజయన్తీ। ఆరుహ్య, ఉన్నతస్థలత్వాత్। మాలమితి నామ్నా ప్రసిద్ధమ్। 'మేఘమన్మథ -యోర్మారో మారం మరణమిష్యతే। మాలా పుష్పాదిబన్ధే స్యాన్మాలమున్నతభూతలమ్' ఇత్యుత్పలమాలా। మాలయోగాన్మాలవ ఇతి హి దేశః ప్రసిద్ధః। కిఞ్చిత్ స్వల్పం పశ్చాత్ పశ్చిమాం దిశముద్దిశ్య, మార్గసౌన్దర్యానురోధేన। లఘుగతిః శీఘ్రగమనః, మధ్యే విశ్రమశైలాభావాత్। 'లఘు క్షిప్రమరం ద్రుతమ్' ఇత్యమరః। ఉత్తరేణ ఉత్తరదిగ్భాగేన। భూయః పునః, అఙ్గీకృతాయా ఉత్తరదిశో మధ్యే పరిత్యాగాత్। ఏవకారో భిన్నక్రమః, ఉత్తరేణైవ ప్రస్తుతేనేత్యర్థః। అత్ర స్వభావోక్త్యలఙ్కారః॥ 16 ॥



**శ్లో॥ త్వామాసారప్రశమితవనోపప్లవం సాధు మూర్ధ్నా**
**వక్ష్యత్యధ్వశ్రమపరిగతం సానుమానామ్రకూటః।**
*న క్షుద్రోఽపి ప్రథమసుకృతాపేక్షయా సంశ్రయాయ*
*ప్రాప్తే మిత్రే భవతి విముఖః కిం పునర్యస్తథోచ్చైః॥* **17**

**- మృణాలినీ వ్యాఖ్యా -**

**పదవిభాగము:-** త్వామ్, ఆసార-ప్రశమిత-వన+ఉపప్లవమ్, సాధు, మూర్ధ్నా,
వక్ష్యతి,+అధ్వశ్రమ-పరిగతమ్, సానుమాన్, ఆమ్రకూటః।
న, క్షుద్రః,+అపి, ప్రథమ-సుకృత+అపేక్షయా, సంశ్రయాయ,
ప్రాప్తే, మిత్రే, భవతి, విముఖః, కిమ్, పునః, యః, తథా,+ఉచ్చైః॥

**ప్రతిపదార్థము:-** హే మేఘ! - ఓ మేఘుడా!

| | | |
|---|---|---|
| ఆసార.... +ఉపప్లవమ్ | = | వర్షధారలచే చల్లార్చబడిన దావాగ్ని గలవాడవును. |
| అధ్వ-.....-పరిగతమ్ | = | మార్గాయాసమును పొందినవాడవును అగు, |
| త్వామ్ | = | నిన్ను, |
| ఆమ్రకూటః | = | 'ఆమ్రకూట' మను |
| సానుమాన్ | = | పర్వతము, |
| సాధు | = | బాగుగా, |
| మూర్ధ్నా | = | శిరస్సుచేత, |
| **వక్ష్యతి** | = | వహింపగలదు. |
| క్షుద్రః+అపి | = | అల్పుడైనను, |
| మిత్రే | = | మిత్రుడు, |
| సంశ్రయాయ | = | ఆశ్రయముకొఱకు, |
| ప్రాప్తే (సతి) | = | వచ్చినవాడు కాగా, |
| ప్రథమ.....అపేక్షయా | = | ఇంతకు మునుపు చేసిన ఉపకారము నాలోచించుటచేత, |
| విముఖః | = | పెడమొగము పెట్టినవాడుగా, |
| న **భవతి** | = | ఉండలేదు. |
| యః | = | ఏ యామ్రకూటము, |
| తథా+ఉచ్చైః | = | ఆ విధముగ ఔన్నత్యముగలదో, |
| కిమ్ పునః | = | ఇక చెప్పనేల? (ఆశ్రమము కోరివచ్చిన వానిని నిరాదరించునా యేమి?) |

**తాత్పర్యము:-** వర్షధారలచే చల్లార్చబడిన దావాగ్ని కలవాడవును, మార్గాయాసమును పొందిన వాడవగు ఓ మేఘుడా! నిన్ను, ఆమ్రకూటపర్వతము చక్కగా శిరస్సున వహించును. అల్పుడైన మిత్రుడు ఆశ్రయముకొఱకు వచ్చినవాడు కాగా, ఇంతకు మునుపు చేసిన ఉపకారము నాలోచించుటచేత పెడమొగము పెట్టిన వాడుగా ఉండలేదు. ఏ యామ్రకూటము ఆ విధముగ ఔన్నత్యముగలదో ఇక చెప్పనేల?

**- పదాదర్శః -**

**1) విభక్తులు-అవ్యయములు-కృత్తులు-క్రియలు:-**

ఆసార...ఉపప్లవమ్-(ద్వి.ఏ.), అధ్వ...గతమ్-(ద్వి.ఏ.), త్వామ్-(ద్వి.ఏ.), ఆమ్రకూటః - (ప్ర.ఏ.), సానుమాన్-(ప్ర.ఏ.), సాధు-(క్రియావిశేషణమ్) మూర్ధ్నా-(తృ.ఏ.), వక్ష్యతి-(క్రియ), క్షుద్రః-(ప్ర.ఏ.),అపి-(అవ్య.),మిత్రే-(స.ఏ.),సంశ్రయాయ-(చ.ఏ.), ప్రాప్తే-(స.ఏ.), ప్రథమ...అపేక్షయా-(తృ.ఏ.), విముఖః-(ప్ర.ఏ.), న- (అవ్య.), భవతి-(క్రియ), యః-(ప్ర.ఏ.), తథోచ్చైః-(అవ్య.ద్వ.), కిమ్-(అవ్య.), పునః- (అవ్య.).

**2) సమాసములు:-**

అ) ఆసారేణ ప్రశమితో వనోపప్లవో యేన తమ్, ఆసారప్రశమితవనోపప్లవమ్, బహువ్రీహిః

ఆ) అధ్వనః శ్రమః అధ్వశ్రమః(ష.త.), తేన పరిగతః, అధ్వశ్రమపరిగతః, (తృ.త.), తమ్, అధ్వశ్రమపరిగతమ్.

ఇ) ఆమ్రాణాం కూటో రాశిః యత్ర సః - ఆమ్రకూటః బహుప్రీహిః (లేదా) ఆమ్రాః కూటేషు యస్య సః వ్యధికరణబహుప్రీహిః.

ఈ) ప్రథమం చ తత్ సుకృతం (కర్మధారయః), తస్య అపేక్షా. ప్రథమసుకృతాపేక్షా (ష.త.), తయా, ప్రథమసుకృతాపేక్షయా

ఉ) విరుద్ధం ముఖం యస్య సః, విముఖః, బహుప్రీహిః॥

**3) పాఠాంతరములు:-**

**4) పదవ్యుత్పత్తి-నిఘంటుప్రమాణాలు-కావ్యప్రయోగములు:-**

అ) **ఆమ్రకూటః :-** 1)ఆమ్రకూట is usually identified with 'అమరకణ్టక', the source of the Narmada, so called becauese it abounds in mango trees. The cloud would be obliging the mountain by extinguishing the forest fire on it, and the mountain in turn would be only too happy to welcome the cloud and to give him a proper shelter. - *Karmarkar.*

2) ఆమ్రః-మామిడిచెట్టు, ఆమ్రమ్-మామిడిపండు.

ఉణాదిసూత్రమ్ -(2-16) "అమితభ్యోర్దీర్ఘశ్చ". ఆమ్రమ్, తామ్రమ్.

వృత్తిః - *"అమ్యతే సమ్భుజ్యతే సేవ్యతే తత్ ఆమ్రమ్, చూతో వా"*.

3) శ్లో॥ .......*స్యాదామ్రశ్చూతశ్చ సహకారః॥* (192) - హలాయుధకోశః.

4) శ్లో॥ *ఆమ్రమామం జలస్విన్నం-మర్దితం దృఢపాణినా।*
*సితాశీతామ్బుసంయుక్తం - కర్పూరమరిచాన్వితమ్॥*

శ్లో॥ *ప్రపాణకమిదం శ్రేష్ఠం - భీమసేనేన నిర్మితమ్।*
*సద్యోరుచికరం బల్యం - శీఘ్రమిన్ద్రియ తర్పణమ్॥* - రాజనిఘంటుః

ఆ) **సానుమాన్ (త్)** - "సానుర్విద్యతేఽస్యేతి । సాను+మతుప్".

శ్లో॥ *అచలశిలోచ్చయశైలక్షితిధరగిరిగోత్రపర్వతాహార్యాః।*
*నగశిఖరిసానుమన్తో ధరాద్రికుధ్రాశ్చ తుల్యార్థాః॥* - హ.కోశము(165)

14 తుల్యనామములను పేర్కొనగా 15 నామములను 'అభిధానచిన్తామణి' పేర్కొన్నది.

శ్లో॥ *శైలోఽద్రిః శిఖరీ శిలోచ్చయగిరీ గోత్రోఽచలః* **సానుమాన్**
*గ్రావా పర్వతభూధ్రభూధరధరాహార్యా నగో,......*

(1. శలః, 2. అద్రిః, 3. శిఖరీ(రిన్), 4. శిలోచ్చయః, 5. గిరిః, 6. గోత్రః, 7. అచలః, 8. సానుమాన్(మత్), 9. గ్రావా (వన్), 10. పర్వతః, 11. భూధ్రః, 12. భూధరః, 13. ధరః, 14. అహార్యః, 15. నగః).

ఇ) **ఉపప్లవః**-'ఉప'-అవ్యయముగ ఎన్నివిధములుగ ప్రయోగింపబడునో గ్రహింపుడు.

శ్లో॥ *ఉప సామీప్యదాక్షిణ్యప్రజనారమ్భభేదనే।*
*ఉత్కోచారాధనే జ్ఞానావజ్ఞాప్రస్తావశిక్షణే॥*

శ్లో॥ *భోగాభోజనసాదృశ్యభూషాలిజ్గనగర్హణే।*
*సాన్త్వనానుగ్రహత్యాగాపకారే యజ్ఞకర్మణి॥*

శ్లో॥ *యత్నచ్ఛాయా రహోభూషావిరామోద్వాహలేపనే।*
*ఔద్ధత్యేఽజ్గీకృతౌ యుక్తావాచాన్తావాసనేబలౌ।*
*లిప్సాసమ్పర్కగుహ్యేషు భృశాధ్యాహారవైకృతే॥* - అని అవ్యయకోశమ్ *(231)*

(సామీప్యే-దాక్షిణ్యే-ప్రజనే-ఆరమ్భే-భేదనే-ఉత్కోచే-ఆరాధనే-జ్ఞానే- అవజ్ఞాయామ్-ప్రస్తావే-శిక్షణే-భోగే-అభోజనే-సాదృశ్యే-భూషాయామ్-ఆలిజ్గనే-గర్హణే-సాన్త్వనే-అనుగ్రహే-త్యాగే-అపకారే-యజ్ఞకర్మణి-యత్నే-ఛాయాయామ్-రహోభాషాయామ్-విరామే-ఉద్వాహే-లేపనే-ఔద్ధత్యే-అజ్గీకృతౌ-యుక్తౌ-ఆచాన్తౌ-ఆసనే-బలౌ-లిప్సాయామ్-సమ్పర్కే-గుహ్యే-భృశే-అధ్యాహారే-వైకృతే).

"హీన-పశ్చాద్భావ-ఉద్యోగ-వ్యాప్తి-మారణ-మరణ-అనుకమ్పా-వీప్సాదయోఽప్యర్థా -అస్య గ్రన్థేషు నిర్దిష్టాః॥" అను అర్థములందును ప్రయోగింపబడునని తెలిపినది.

ఈ) **'ఉచ్చైః మహత్యే'** - 'ఉత్కృష్టే' ఇతి శాకటాయనః॥ అనిన అవ్యయకోశము, ఈ శ్లోకభాగమైన 'కిం పునర్యస్తథోచ్చైః' । అనుదాని నుదాహరించినది.

**5) క్రియారూపములు:-** 1) **వక్ష్యతి,** 2) **భవతి** - పూర్వము చెప్పబడినది.

1) వహ (వహ్) ప్రాపణే, మోయుట, ప్రవహించుట, ద్వికర్మకమ్, భ్వా.ప్ర., అనిట్, ఉభయపదీ. పరస్మైపదీ, లృట్-ప్రథమపురుషైకవచనమ్. **వక్ష్యతి**-వక్ష్యతః-వక్ష్యన్తి.

**6) అలంకారములు:-** ఈ శ్లోకమందలి పూర్వార్ధము ఉత్తరార్ధముచే సమర్థింపబడుటచే నిది అర్థాన్తరన్యాసాలంకారముగ చెప్పబడినది. లక్షణమ్ -

మూ॥ *జ్ఞేయః సోఽర్థాన్తరన్యాసో వస్తు ప్రస్తుత్య కిఞ్చన।*
*తత్సాధనసమర్థస్య న్యాసో యోఽన్యస్య వస్తునః॥* -కావ్యాదర్శః-2.169 బా.నం.వ్యా.

'ఒకానొక విషయమును ప్రస్తావించి, ఆ ప్రస్తుతమైన వస్తువును సమర్థించుటకు సమర్థమైన మరియొక అప్రస్తుత విషయముయొక్క ఏ ప్రతిపాదనము (ఉపన్యాసము) కలదో, అది అర్థాన్తరన్యాసాలంకారముగా తెలియదగినది'.

**సఞ్జీవినీవ్యాఖ్యా:-** త్వామితి । ఆమ్రాశ్చూతాః కూటేషు శిఖరేషు యస్య స ఆమ్రకూటో నామ సానుమాన్పర్వతః । "ఆమ్రశ్చూతో సరలోఽసౌ" "కూటోఽస్త్రీ శిఖరం శృజ్గమ్" ఇతి చామరః । ఆసారో ధారావృష్టిః । "ధారాసమ్పాత ఆసారః" ఇత్యమరః । తేన ప్రశమితో వనోపప్లవో దావాగ్నిర్యేన తమ్, కృతోపకారమిత్యర్థః । అధ్వశ్రమేణ పరిగతం వ్యాప్తం త్వాం సాధు సమ్యఙ్మూర్ధ్నా వక్ష్యతి వోఢా । వహేర్లృట్ । తథా హి-క్షుద్రః కృపణోఽపి। "క్షుద్రో దరిద్రే కృపణే నృశంసే" ఇతి యాదవః । సంశ్రయాయ సంశ్రయణాయ మిత్రే సుహృది । "అథ మిత్రం సఖా సుహృత్" ఇత్యమరః॥ ఆగతే సతి॥

ప్రథమసుకృతాపేక్షయా పూర్వోపకారపర్యాలోచనయా విముఖో న భవతి యస్తథా తేన ప్రకారేణోచ్చైరున్నతః స ఆమ్రకూటః కిం పునర్విముఖో న భవతీతి కిము వక్తవ్య మిత్యర్థః ఏతేన ప్రథమావసథే సౌఖ్యలాభాత్తే కార్యసిద్ధిరస్తీతి సూచితమ్ । తదుక్తం నిమిత్తనిదానే – "ప్రథమావసథే యస్య సౌఖ్యం తస్యాఖిలేఽధ్వని శివం భవతి యాత్రాయామన్యథా త్వశుభం ధ్రువమ్ ॥" ఇతి ॥ 17 ॥

**బ్రహ్మప్రకాశికావ్యాఖ్యా:**–అథ వలగణ్డీతి ప్రసిద్ధమార్గస్థం విశ్రామమణ్డపద్వయమత్యుచ్చత్వా త్పర్వతద్వయముత్ప్రేక్షతే శ్లోకద్వయేన – త్వామాసారేతి । శ్రీకృష్ణ! సార సమ్యక్ త్వం, సారాత్ ఆ ఆసారం సమ్యక్పర్యన్తమిత్యర్థః । ప్రశమితః వనస్య ఉచ్చాభివృష్టస్య భూతలే ప్రవహతశ్చోభయతశ్చాపి జలస్య ఉపప్లవ ఉపద్రవో యత్ర । అత్యుచ్చత్వాదుపరి పాషాణాఛన్నత్వాచ్చ జలాన్యుపప్లవవన్తి । ఏవం యథా స్యాత్ సాథ చ యథా స్యాత్తథా। అధ్వశ్రమపరిగతం త్వాం సానుమాన్ గిరిరివాత్యుచ్చో వలగణ్డీ పర్వతః । భవన్నైవేద్యార్థం భక్తైరానీయ స్థాపితానామామ్రాణాం కూటో యస్మిన్ తథాభూతః । ప్రాప్తే మిత్రే వయస్యే విముఖో న భవతి । యస్తథోచ్చైరనన్యసాధారణః పరమమిత్రం పరమేశ్వరశ్చ తస్మిన్ పరమాత్మని త్వయి, పాదరజీకృతాపవర్గే ప్రాప్తే కిం పునః । త్వద్విశ్రామార్థమర్ధమార్గే మయా ఘటితో దేవాలయోఽపి సఫలోఽస్తు ॥ 17 ॥

**విద్యుల్లతావ్యాఖ్యా:**– అథ దూరసరణిగమనఖిన్నస్య విశ్రమస్థానముపదిశతి –– త్వామితి। 'ఆసారః స్యాత్ప్రసరణే వేగవృష్టౌ సుహృద్బలే' ఇతి వైజయన్తీ । ప్రశమితః ప్రకర్షేణ నాశితః వనోపప్లవః దవప్లోషలతాశోషాదిస్తటకాననోపద్రవో యస్య । సాధు సమ్యక్ । మూర్ధ్నా శిఖరేణ, శిరసేతి చ । వక్ష్యతీతి, వహతేర్ధాతోర్లృటి । శిరసా వహనం నామ లక్షణయా సత్కారాతిశయః। అధ్వశ్రమపరిగతం మార్గగమనసమ్భృతేనాయాసేన సమేతమ్, తదానీం విశేషతః సత్కారస్యౌచిత్యమ్, అన్యథా తాటస్థ్యమపి నాతిదోషాయేతి భావః । సానుమాన్ పర్వతః। ఆమ్రకూట ఇతి నామ। కుతోఽత్ర నిశ్చయః, జనమనసామనవ –స్థానాదిత్యాశ్యాహ –– క్షుద్రః కులాదిభిర్నీచః । ప్రథమసుకృతాపేక్షయా స్వవిషయే పూర్వం తేన ప్రత్యుక్తముపకారమాలోచ్య । సంశ్రయాయ స్వగృహనివాసార్థమ్ । ప్రాప్తే నిధావివాత్మనాన్వేషణీయే స్వయముపగత ఇత్యర్థః । మిత్రే 'ఇహ లోకసుఖం మిత్రమ్' ఇతి లక్షితార్థస్య మిత్రశబ్దస్య ముఖ్యాభిధేయే పుంసి । అనేన అభఙ్గురప్రేమాస్పదత్వం సుహృదాం సూచితమ్। తథా కుమారసమ్భవే––'**ప్రమదాస్వనవస్థితం నృణాం న కలు ప్రేమ చలం సుహృజ్జనే**', ఇతి । అత్ర నృణామితి న తు సతామితి సదసత్సాధారణత్వమ్, న చలమిత్యభఙ్గురత్వం చ సుహృత్ప్రేమ్ణః ప్రకాశితమ్ । విముఖః ప్రతినివృత్తముఖః, అనాదర ఇతి యావత్ । కిం పునర్యః స ఇత్యాక్షిప్యతే, తస్య స్వప్నేఽపి వైముఖ్యం నాశఙ్కనీయమితి భావః । తథేతి, అనుభవాభినయః । ఉచ్చః ఉన్నతః, ప్రాణాత్యయేఽ ప్యనుచితేష్వదత్తదృష్టిరిత్యర్థః। అత్ర పూర్వార్ధే సమాసోక్తిమూలాప్రస్తుతప్రశంసా, ఉత్తరార్ధేఽర్థాన్తరన్యాసః ॥ 17 ॥

శ్లో॥ ఛన్నోపాన్తః పరిణతఫలద్యోతిభిః కాననామ్రై
స్త్వయ్యారూఢే శిఖరమచలః స్నిగ్ధవేణీసవర్ణే।
నూనం యాస్యత్యమరమిథునప్రేక్షణీయామవస్థాం
మధ్యే శ్యామః స్తన ఇవ భువః శేషవిస్తారపాణ్డుః॥ 18

- మృణాళినీ వ్యాఖ్యా -

పదవిభాగము:- ఛన్న+ఉపాన్తః, పరిణత-ఫల-ద్యోతిభిః, కానన+ఆమ్రైః, త్వయి,+ఆరూఢే, శిఖరమ్, అచలః, స్నిగ్ధ-వేణీ-సవర్ణే। నూనం, యాస్యతి,+అమర-మిథున-ప్రేక్షణీయామ్, అవస్థామ్, మధ్యే, శ్యామః, స్తనః, ఇవ, భువః, శేష-విస్తార-పాణ్డుః॥

ప్రతిపదార్థము:- హే మేఘ! - ఓ మేఘుడా!

| | | |
|---|---|---|
| పరిణత-ఫల-ద్యోతిభిః | = | పండిన పండ్లచేత ప్రకాశించునట్టి, |
| కానన+ఆమ్రైః | = | అడవి మామిడి చెట్లతో, |
| ఛన్న+ఉపాన్తః | = | కప్పబడిన పార్శ్వములుగల, |
| అచలః | = | ఆమ్రకూటపర్వతము, |
| స్నిగ్ధ-వేణీ-సవర్ణే | = | చిక్కనైన జడలతో సమానమైన వర్ణముగల, |
| త్వయి | = | నీవు, |
| శిఖరమ్ | = | శిఖరమును, |
| ఆరూఢే (సతి) | = | అధిరోహించినవాడవగుచుండగా, |
| మధ్యే | = | నడుమ, |
| శ్యామః | = | నల్లనిదియు, |
| శేష-విస్తార-పాణ్డుః | = | మిగిలిన చోటంతయు తెల్లనిదియునైన, |
| భువః | = | భూమియొక్క |
| స్తనః ఇవ | = | స్తనమువలె, |
| అమర...ప్రేక్షణీయామ్ | = | ఆకాశమందు సంచరించు దేవతల జంటలచే చూడదగిన. |
| అవస్థామ్ | = | స్థితిని, |
| నూనమ్ | = | నిశ్చయముగ, |
| **యాస్యతి** | = | పొందును. |

**తాత్పర్యము:-** ఓ మేఘుడా! పండిన పండ్లచేత ప్రకాశించునట్టి అడవి మామిడి చెట్లతో కప్పబడిన పార్శ్వములుగల ఆమ్రకూటపర్వతము, చిక్కనికేశములతో సమానమైన వర్ణము గల నీవు, పర్వతశిఖరమున అధిరోహించినవాడవగుచుండగా, నడుమ నల్లనిదియు, మిగిలినచోటంతయు తెల్లనిదియునై, భూమియొక్క స్తనమువలె, ఆకాశమందు సంచరించు దేవతల జంటలచే చూడదగిన స్థితిని నిశ్చయముగ పొందును.

- పదాదర్శః -

**1) విభక్తులు-అవ్యయములు-కృత్తులు-క్రియలు:-**

పరిణత...ద్యోతిభిః-(తృ.బ.), కాననామ్రైః-(తృ.బ.)., ఛన్నోపాన్తః-(ప్ర.ఏ.), అచలః

-(ప్ర.ఏ.), స్నిగ్ధ....సవర్ణే-(స.ఏ.), త్వయి-(స.ఏ.), శిఖరమ్-(ద్వి.ఏ.) ఆరూఢే-(స.ఏ.), మధ్యే-(స.ఏ.), శ్యామః-(ప్ర.ఏ.), శేష...పాణ్డుః-(ప్ర.ఏ.), భువః-(ష.ఏ.), స్తనః-(ప్ర.ఏ.), ఇవ-(అవ్య.), అమర...యామ్-(ద్వి.ఏ.), అవస్థామ్-(ద్వి.ఏ.), నూనమ్-(అవ్య.), యాస్యతి-(క్రియ).

**2) సమాసములు:-**

అ) ఛన్న ఉపాన్తో యస్య సః, ఛన్నోపాన్తః - బహువ్రీహిః.

ఆ) పరిణతాని చ ఫలాని పరిణతఫలాని (కర్మధారయః), తైః ద్యోతిభిః (తృ.త.), పరిణతఫలద్యోతిభిః.

ఇ) కాననే ఆమ్రః కాననామ్రః, తైః కాననామ్రైః (సప్తమీ తత్పురుషః).

ఈ) స్నిగ్ధయా వేణీ తస్యాః సదృశః వర్ణః యస్య సః, స్నిగ్ధవేణీసవర్ణః (బహువ్రీహిః), తస్మిన్, స్నిగ్ధ....సవర్ణే.

ఉ) అమరాణాం మిథునాని, అమరమిథునాని, (ష.త.), అమరమిథునానామ్ ప్రేక్షణీయా, అమరమిథనప్రేక్షణీయా (ష.త.), తామ్, అమర....యామ్.

ఊ) శేషే విస్తారః శేషవిస్తారః, శేషవిస్తారే పాణ్డుః, శేష ... పాణ్డుః (స.త.)

**3) పాఠాంతరములు:-** మధ్యే శ్యామః > మేఘశ్యామః

**4) పదవ్యుత్పత్తి-నిఘంటుప్రమాణములు-కావ్యప్రయోగములు:-**

అ) స్తన ఇవ : 1) స్తనః, 2) ఇవ

1) స్తనః-*స్తన్యతే శబ్ద్యతే కాముకైః, స్తనయతి కథయతి వక్షః, శోభామితి వా। స్తన్ శబ్దే + ఘఞ్.*

*"ఉరసిజకుచవక్షోరుహపయోధరాః స్తనసమాన నామాని।"- హలాయుధకోశః-526.*

శ్లో॥ *స నిర్విశ్య యథాకామం తటేష్వాలీనచన్దనౌ।*
*స్తనావివ దిశస్తస్యాః శైలౌ మలయదర్దురౌ॥* - రఘువంశమ్-4.51

"రఘుమహారాజు, దరులయందు వ్యాప్తమైన గంధవృక్షములును గంధలేపనము కలిగిన ఆ దక్షిణదిక్కుయొక్క స్తనములవలెనున్న మలయదర్దుర నామకములైన పర్వతములపై స్వేచ్ఛగా విహరించి....."

2) ఇవ - "ఇవ ఈషదర్థోపమోత్ప్రేక్షావాక్యాలఙ్కారేషు" (ఈషదర్థే-ఉపమాయామ్-ఉత్ప్రేక్షాయామ్-వాక్యాలఙ్కారే) వాక్యాలఙ్కారో నామ నిరర్థకత్వమ్। నిదర్శనమపి ఉపమాయామేవ పర్యవస్యతి। అవధారణార్థేఽపి। - అని అవ్యయకోశము.

ఆ) The dark cloud on the summit of (ఆమ్రకూట) is compared to the dark nipple of the breast, and the slopes of mountain, yellowish green on account of the mango-trees, to the rest of the breast - Karmarkar.

3) శ్లో॥ వామం సన్ధిస్తిమితవలయం న్యస్యహస్తం నితమ్బే
కృత్వా శ్యామా విటపిసదృశం స్రస్త ముక్తం ద్వితీయమ్।
పాదాఙ్గుష్ఠాలులితకుసుమే కుట్టిమే పాతితాక్షం
నృత్యాదస్యాః స్థితమతితరాం కాన్త మృజ్వాయతార్ధమ్॥ -మా.మి. 2-6

4) "దశకణ్ఠరావణకృత 'శివతాణ్డవ' స్తోత్రమ్"-ను ఇచట అనుసంధానము చేసికొన దగును. - శివతాణ్డవస్తోత్రమ్-విపులవ్యాఖ్య-సాధనగ్రంథమండలి, తెనాలి.

5) a) నృత్తే కృప్రత్యయే నృత్య-శబ్దః కర్మ వివక్షయా।
భావోపసర్జితే యత్ర-రసో ముఖ్యః ప్రకాశ్యతే॥ - **కుమ్భః**

b) రసభావవ్యఞ్జకాదియుతం నృత్యమితీర్యతే। - **భరతకల్పలతః**

**5) క్రియారూపము:-** 1) హర

1) **హృఞ్** (హృ) - భ్వాదిప్రకరణమ్, ద్వికర్మకమ్, అనిట్, ఉభయపదీ.
పరస్మైపదీ- లోట్ - మధ్యమపురుషైకవచనమ్ **హర/హరతాత్**-హరతమ్-హరత.

**6) అలంకారములు:-** ఈ శ్లోకమున 1) 'భుజతరు'మనుచోట - రూపకము, 2) 'ప్రతినవ జపాపుష్పరక్తమ్' అనుచోట లుప్తోపమ, 3) 'మేఘము' - సన్ధ్యారాగమును, 'ధరించిన' దనుచోట అసంభవద్వస్తు సంబంధమగు 'నిదర్శనాలఙ్కారము', 4) ఈ మూడును పరస్పర నిరపేక్షములగుటచేత 'సంసృష్ట్యలఙ్కారము' చెప్పదగును.

1) రూపకలక్షణమ్ - శ్లో॥ యత్స్యాద్విషయిరూపేణ విషయస్యోపరఞ్జనమ్।
రూపకం తద్విధాభేద తాద్రూప్యావసితం విదుః॥

వృత్తి:-విషయి ఉపమానభూతం చన్ద్రాదివిషయస్తదుపమేయభూతం వర్ణనీయం. ముఖాది విషయిణో రూపేణ యద్విషయస్యోపరఞ్జనం ఉపరఞ్జన మివోపరఞ్జనం స్వోపరక్తబుద్ధి విషయీకరణమితి యావత్। తద్రూపకమ్ ...- అ.మ.

2) శ్లో॥ వర్ణ్యోపమాన ధర్మాణా ముపమావాచకస్య చ।
ఏకద్విత్ర్యనుపాదానాద్భిన్నా లుప్తోపమాష్టధా॥ - చన్ద్రాలోకః (2)

3) నిదర్శనాలంకారలక్షణమ్- శ్లో॥ ఉపాత్తయోరర్థయోశ్చేదార్థాభేదః ప్రకీర్త్యతే।
ఔపమ్యపర్యవసితో భవేత్సేయం నిదర్శనా॥

వృత్తి:- ఉపాత్తయోః అర్థయోః ఆర్థోభేద ఔపమ్యపర్యవసాయీ నిదర్శనేత్యర్థః।

4) సంసృష్ట్యలఙ్కారలక్షణమ్-శ్లో॥ అలంకృతీనాం సర్వాసాం యథా సమ్భవమేళనే।
లౌకికేనామి వై తాసాం చారుతాతిశయేక్షణాత్॥

వృత్తి:- "ననూక్తానామలఙ్కారాణామనేకేషామేకత్రావస్థానే కిం తత్తదలఙ్కారత్వైవ।"
- అలంకారమణిహారే.

**సఞ్జీవినీవ్యాఖ్యా:-** పశ్చాదితి। పశ్చాత్ సన్ధ్యాబల్యనన్తరమ్। పశుపతేః శివస్య నృత్యారమ్భే తాణ్డవప్రారమ్భే ప్రతినవజపాపుష్పరక్తం ప్రత్యగ్రజపాకుసుమారుణం సన్ధ్యాయాం భవం

సాన్ధ్యం తేజో దధానః। ఉచ్చైరున్నతం భుజా ఏవ తరవస్తేషాం వనం మణ్డలేన మణ్డలాకారేణాభిలీనోఽభివ్యాప్తః సన్। కర్తరి క్తః। భవాన్యా భవపత్న్యా। 'ఇన్ద్రవరుణభవశర్వ రుద్రమృడహిమారణ్యయవయవనమాతులాచార్యాణామానుక్' – (పా. 4. 1. 49) ఇతి జీష్ ఆనుగాగమశ్చ। శాన్త ఉద్వేగో గజాజినదర్శనభయం యయోస్తే అత ఏవ స్తిమితే నిశ్చలే నయనే యస్మిన్కర్మణి తత్తథోక్తమ్। "ఉద్వేగస్త్వరితే క్లేశే భయే మన్థరగామిని" ఇతి శబ్దార్ణవే। భక్తిః పూజ్యేష్వనురాగః। భావార్థే క్తిన్ప్రత్యయః। దృష్టా భక్తిర్యస్య స దృష్టభక్తిః సన్। పశుపతేరార్ద్రం శోణితార్ద్రం యన్నాగాజినం గజచర్మ। "అజినం చర్మ కృత్తిః స్త్రీ" ఇత్యమరః। తత్రేచ్ఛాం హర నివర్తయ, త్వమేవ తత్స్థానే భవేత్యర్థః। గజాసురమర్దనానన్తరం భగవాన్మహాదేవస్తదీయమార్ద్రాజినం భుజమణ్డలేన బిభ్రత్తాణ్డవం చకారేతి ప్రసిద్ధిః। దృష్టభక్తిరితి కథం రూపసిద్ధిః ? 'దృష్ట' – శబ్దస్య "స్త్రియాః పుంవత్–" (పా. 6. 3. 34) ఇత్యాదినా పుంవద్భావస్య దుర్ఘటత్వాదపూరణీప్రియాదిష్వితి నిషేధాత్। 'భక్తి' శబ్దస్య ప్రియాదిషు పాఠాదితి। తదేతచ్చోద్యం 'దృఢభక్తిః' ఇతి శబ్దమాశ్రిత్య ప్రతివిహితం గణవ్యాఖ్యానే దృఢం భక్తిరస్యేతి నపుంసకం పూర్వపదమ్। అదార్ఢ్యనివృత్తి పరత్వే దృఢశబ్దాల్లిఙ్గవిశేషస్యానుపకారిత్వాత్స్త్రీత్వమవివక్షితమితి। భోజరాజస్తు "–'భక్తౌ చ కర్మసాధనాయామ్' ఇత్యనేన సూత్రేణ భజ్యతే సేవ్యత ఇతి కర్మార్థత్వే భవానీభక్తిరిత్యాది భవతి। భావసాధనాయాం తు స్థిరభక్తిర్భవాన్యామ్' ఇత్యాది భవతి" ఇత్యాహ। తదేతత్సర్వం సమ్యగ్వివేచితం రఘువంశసఞ్జీవిన్యాం "దృఢభక్తిరితి జ్యేష్ఠే" (రఘు. 12. 19) ఇత్యత్ర తస్మాద్దృష్టభక్తిరిత్యత్రాపి మతభేదేన పూర్వపదస్య స్త్రీత్వేన నపుంసకత్వేన చ రూపసిద్ధిరస్తీతి స్థితమ్ ॥

**బ్రహ్మప్రకాశికావ్యాఖ్యా:–** పశ్చాదుచ్చైరితి। హే హర! మత్సరస్తీరస్థ నీలకణ్ఠేశ్వర! త్వం హరేర్గుణ్డిచామణ్డపగమనస్యారమ్భే। పశుపతేర్వృషభస్య పశ్చాత్। మణ్డలేన భ్రమికరణేన। తవ భుజావాహవ ఏవ తరవస్తేషాం వనం సమూహమభిలీనః। నవజపాపుష్పవద్రక్తం సాన్ధ్యం తేజః ప్రతి లక్షీకృత్య। నీలనభస్తలస్థత్వాత్। ఆర్ద్రనాగాజినేచ్ఛాం దధానః, సన్, నీలనభోర్మస్థ సాన్ధ్యకిరణేషు సద్యః కృత్తిగజకృత్తిరుచిం ప్రతీచ్ఛన్, ఉచ్చైర్నృత్య। గుణ్డిచా మణ్డపే భగవద్దర్శనానన్దేనేత్యర్థః। త్వం కిమ్భూతః। ఆనన్దేన భర్తుర్నృత్యం, శాన్తో నష్టో యః భక్తియోగో దుష్ప్రాప ఇత్యుద్వేగస్తేన స్తిమితం చిన్తాభవేన నిశ్చలీకృతం నయనం యత్ర ఏవం యథా స్యాత్తథా భవాన్యా పార్వత్యా దృష్టా భక్తి ర్నవలక్షణా యస్య ॥36॥

**విద్యుల్లతావ్యాఖ్యా:–** అథ దేవదేవస్య సేవాయాం ప్రకృష్టం ప్రకారాన్తరమాహ–– పశ్చాదితి। పశ్చాత్ పటహకృత్యానుష్ఠానానన్తరమ్। అథవా పృష్ఠభాగే, కరికృత్తిప్రావరణౌచిత్యాత్। ఉచ్చైః ఊర్ధ్వీకృతమ్। భుజతరువనం వృత్తోత్తుఙ్గకఠినాయతత్వైర్భుజేషు తరుత్వారోపణమ్, బాహుల్యాద్వనోక్తిః। మణ్డలేన వర్తులేనాకారేణ। అభిలీనః ఆశ్రితః। సాన్ధ్యం సన్ధ్యాకాల సమ్బన్ధి। తేజః ప్రభావిశేషమ్। ప్రతినవజపాపుష్పరక్తం తత్కాలవిలసితరుద్రపుష్ప

వత్సిన్గ్ధారుణమ్। దధానః మేఘానాం సన్ధ్యాకాలే తస్య తత్సమ్బన్ధిత్వనియమాత్, 'సన్ధ్యా-పయోదకపిశాః పిశితాశనానామ్' ఇత్యాదిప్రయోగదర్శనాత్, అనుభావాచ్చ । నృత్తారమ్భే అనన్దతాణ్డవప్రక్రమే। హర అపనయ। ఆర్ద్రనాగాజినేచ్ఛాం నవోత్పాటితత్వాత్క్షరదరుణరుధిర రఞ్జిత కుఞ్జరత్వక్ప్రావరణాభిలాషమ్, తద్రూపసామ్యసాకల్యేన భవతైవ తత్కార్యస్యా-ఽనుష్ఠానాత్ । పసుపతేరార్ద్రనాగాజినేచ్ఛామితి। త్రిభువనపతేరాత్మారామస్య కామరిపో రాశాపాశానుపహతత్వేన తాదృశేష్వేవోపేక్షణీయేషు భావౌచిత్యాదితి భావః, న తు నాగాజిననిర్బన్ధపరమ్, తథా కుమారసమ్భవే -- **'విభూషణోద్భాసి పినద్ధభోగి వా గజాజినాలమ్బి దుకూలధారి వా। కపాలి వా స్యాదథవేన్దుశేఖరం న విశ్వమూర్తే -రవధార్యతే వపుః ॥'** ఇతి క్వచిదప్యైకాన్తికరనన్య దూరోత్సారణాత్। శాన్తోద్వేగః ప్రచణ్డతాణ్డవోద్దణ్డభుజతరుషణ్డస్య ఖణ్డపరశోర్జ్గదణ్డఖణ్డనక్షమేషు మణ్డలభ్రమణ సమ్భ్రమేషు ధైర్యావలమ్బేన నియన్త్రితభయవికారః । స్తిమితనయనం కామచారిణో విషయ రసికస్యాస్య కథమీదృశీ భక్తిరుత్పన్నేతి విస్మయవికసితనిభృత నయనకువలయమ్। భవాన్యా పరమేశ్వరస్య నిరతిశయైశ్వర్యసర్వస్వభూతయా శరీరార్ధస్వామిన్యా దేవ్యా పార్వత్యా, తద్దర్శనేఽపి న భవానుగ్రహఫలసిద్ధో వ్యభిచారః,శివస్యాపి భక్తానుగ్రహకరణే తన్ముఖప్రేక్షిత్వా -దితి భావః, 'యథా శివస్తథా దేవీ యథా దేవీ తథా శివః । నానయోరన్తరం విద్యాచ్చన్ద్రచన్ద్రికయోరివ ॥' ఇతి వాయూక్తేః, 'పరో హి శక్తిరహితః శక్తః కర్తుం న కిఞ్చన। శక్తస్తు పరమేశో హి శక్త్యా యుక్తో యదా భవేత్ ॥' ఇత్యాగమాచ్చ । దృష్టభక్తిః ప్రత్యక్షీకృతభక్తికార్యః, న తు శ్రుతభక్తిః । అనేన సద్య ఏవ ఫలప్రాప్తిర్భావినీతి ద్యోత్యతే, 'భక్త్యోపపన్నేషు హి తద్విధానాం ప్రసాదచిహ్నాని పురః ఫలాని' ఇత్యుక్తత్వాత్ । అత్ర సదృశానుభవాద్వస్త్వన్తరస్మృతిలక్షణం స్మరణమలఙ్కారః, యథా -- 'యైర్దృష్టోఽసి తదా లలాటపతితప్రాసప్రహారో యుధి స్ఫీతాసృక్స్రుతిపాటలీకృతపురోభాగం పరాన్ధారయన్। తేషాం దుఃసహకామదేవదహనప్రోద్భూతనేత్రానలజ్వాలాలీభరభాసురే స్మరరిపావస్తఙ్గతం కౌతుకమ్'ఇత్యత్ర ॥36॥



శ్లో॥ **గచ్ఛన్తీనాం రమణవసతిం యోషితాం తత్ర నక్తం**
**రుద్ధాలోకే నరపతిపథే సూచిభేద్యైస్తమోభిః।**
**సౌదామిన్యా కనకనికషస్నిగ్ధయా దర్శయోర్వీం**
**తోయోత్సర్గస్తనితముఖరో మా స్మ భూర్విక్లబాస్తాః॥** **37**

**- మృణాలినీ వ్యాఖ్యా -**

**పదవిభాగము:-** గచ్ఛన్తీనామ్, రమణ-వసతిమ్, యోషితామ్, తత్ర, నక్తమ్
రుద్ధ+ఆలోకే, నరపతి-పథే, సూచి-భేద్యైః,+తమోభిః।
సౌదామిన్యా, కనక-నికష-స్నిగ్ధయా, దర్శయ, +ఉర్వీమ్
తోయ+ఉత్సర్గ-స్తనిత-ముఖరః, మా స్మ భూః,+విక్లబాః, +తాః॥

**ప్రతిపదార్థము:-** హే మేఘ! - ఓ మేఘుడా!

| | | |
|---|---|---|
| తత్ర | = | ఆ యుజ్జయినీ నగరమున, |
| నక్తమ్ | = | రాత్రియందు, |
| రమణ-వసతిమ్ | = | ప్రియుని యింటినిగూర్చి, |
| గచ్ఛన్తీనామ్ | = | పోవుచున్న, |
| యోషితామ్ | = | (అభిసారికలగు) స్త్రీలకు |
| సూచి-భేద్యైః | = | సూచీభేద్యములగు, |
| తమోభిః | = | చీకట్లచేత, |
| రుద్ధ+ఆలోకే | = | అడ్డగింపబడిన ప్రకాశముగల, |
| నరపతి-పథే | = | రాజమార్గమునందు, |
| కనక-నికష-స్నిగ్ధయా | = | గీటురాయిమీది బంగారు గీత వంటికాన్తిగల, |
| సౌదామిన్యా | = | మెఱుపుచేత, |
| ఉర్వీమ్ | = | భూమిని, |
| **దర్శయ** | = | చూపుము. |
| తోయ...ముఖరః | = | వృష్టిగర్జనలను మ్రోయువాడవు, |
| **మా స్మ భూః** | = | కాబోకుము. |
| తాః | = | ఆ స్త్రీలు, |
| విక్లబాః | = | భయపడువారు. |

**తాత్పర్యము:-** ఓ మేఘుడా! ఆ యుజ్జయినీ నగరమున రాత్రియందు ప్రియుని యింటికి పోవుచున్న అభిసారికలకు, సూచీభేద్యములగు చీకట్లచేత అడ్డగింపబడిన ప్రకాశముగల రాజమార్గమునందు, గీటురాయి మీది బంగారుగీతవంటి కాన్తిగల మెఱుపుచేత, భూమిని చూపుము. వృష్టిగర్జనలను మ్రోయువాడవు కాబోకుము. ఆ స్త్రీలు భయపడువారు.

**- పదాదర్శః -**

**1) విభక్తులు-అవ్యయములు-కృత్తులు-క్రియలు:-**

తత్ర-(అవ్య.),నక్తమ్-(ద్వి.ఏ.),రమణవసతిమ్-(ద్వి.ఏ.),గచ్ఛన్తీనామ్-(ష.బ.) యోషితామ్ -(ష.ఏ.), సూచిభేద్యైః-(తృ.బ.), తమోభిః-(తృ.బ.), రుద్ధాలోకే-(స.ఏ.), నరపతిపథే-(స.ఏ.), కనకనికషస్నిగ్ధయా-(తృ.ఏ.), సౌదామిన్యా-(తృ.ఏ.), ఉర్వీమ్-(ద్వి.ఏ.), దర్శయ-(క్రియ), తోయ...ముఖరః-(ప్ర.ఏ.), మాస్మభూః-(క్రియ), తాః -(ప్ర.బ.)

**2) సమాసములు:-**

అ) రమణస్య వసతిమ్, రమణవసతిమ్ (ష.త.)

ఆ) రుద్ధః ఆలోకః యస్మింస్తస్మిన్, రుద్ధాలోకే, (బహువ్రీహిః)

ఇ) నరాణాం పతిః, నరపతిః (ష.త.) తస్య పన్థాః, తస్మిన్, (ష.త.), నర....పథే.

ఈ) సూచిభిః భేద్యాః (తృ.త.) తైః, సూచిభేద్యైః.

ఉ) కనకస్యనికషః, కనకనికషః (ష.త.), తద్వత్ స్నిగ్ధం యస్యాః తథా కనకనికష స్నిగ్ధయా. (వ్యధికరణబహువ్రీహిః)

ఊ) తోయోత్సర్గశ్చ స్తనితశ్చ, తోయోత్సర్గస్తనితమ్ (ద్వన్ద్వః) తాభ్యాం, ముఖరః, తోయో...ముఖరః.

**3) పాఠాంతరములు:-** 1) నక్తమ్ > రాత్రౌ, 2) రుద్ధాలోకే > రుద్దాలోకైః, 3) సౌదామిన్యా > సౌదామన్యా, 4) స్నిగ్ధయా > ఛాయయా, స్పర్ధయా, 5) తోయోత్సర్గ > తోయోత్సర్గాత్, 6) ముఖరః > విముఖః, 7) మాస్మభూః > మాచభూః.

**4) పదవ్యుత్పత్తి-నిఘంటుప్రమాణములు-కావ్యప్రయోగములు:-**

అ) **యోషితామ్** - యోషా, యోషిత్, యోషితా -> జోషా, జోషిత్, జోషితా।

1) ఉ.సూ.(1-97)-హ్రుస్రురుహియుషిభ్య ఇతిః। హరిత్। సరిత్। రోహిత్। యోషిత్।

వృత్తి:- *'యుష'ఇతి సౌత్రో ధాతుః, అథవా 'జుష' ఇత్యస్య వర్ణవికారేణ పాఠః। యుష్యతే(జుష్యతే) సేవ్యతే ప్రీణయతి వా సా యోషిత్ స్త్రీ వా॥*

యథా 'ప్రత్యాచరురివ యేషన్తమ్' ఇత్యథర్వణి (4-7-4) ప్రయుజ్యతే। సాయణోత్ర 'జేషృ ప్రయత్నే ఇత్యస్య యకారాదేశః, జేషన్తమ్' ఇతి వ్యాచఖ్యౌ। ప్రకృత్యన్తర నిర్దేశ ఏవేతి మతం సాధు।

2) i) యోషా - *యౌతి మిశ్రీభవతీతి । యు మిశ్రణే+బాహులకాత్ స। స్త్రియాం టాప్ ।* - హలాయుధకోశం (29) నామములను పేర్కొన్నది.

ii) శ్లో॥ రామా వామా వామనేత్రా పురన్ధ్రీ -నారీ భీరుర్భామినీ కామినీ చ।
**యోషా** యోషిద్వాసితా వర్ణినీ స్త్రీ-స్యాత్సీమన్తిన్యఙ్గనా సున్దరీ చ॥

శ్లో॥ *అబలా మహిలా లలనా ప్రమదా రమణీ నితమ్బినీ వనితా।
దయితా ప్రదీపదర్శిన్యుక్తౌ కాన్తా వధూర్వశా యువతిః॥*

ఆ) **సౌదామిన్యా** > 'సౌదామినీ - సౌదామనీ'

1) శ్లో॥ *శమ్పా చపలా క్షణికా శతహ్రదా హ్లాదినీ తడిద్విద్యుత్।
**సౌదామిన్య** చిరాంశుః ప్రాజ్ఞైరైరావతీ చ విజ్ఞేయా॥* (హలాయుధకోశః-60)

2) శ్లో॥ *తత్ర స్మ రాజతే భైమీ సర్వాభరణభూషితా।
సఖీ మధ్యేఽనవద్యాఙ్గీ విద్యుత్ **సౌదామినీ** యథా॥* - ఇతి మ.భా.3.53.12

3) శ్లో॥ *కామం ప్రదోషతిమిరేణ న దృశ్యసే త్వం
**సౌదామనీవ** జలదోదర సన్నిలీనా।
త్వాం సూచయిష్యతి తు మాల్యసముద్భవోఽయం
గన్ధశ్చ భీరు! ముఖరాణి చ నూపురాణి॥* - మృచ్ఛకటికమ్-1.35

'ఈ సందెచీకటిలో నీవు మబ్బుదొంతరల మధ్య కనుమరుగైన మెఱుపుతీగలవలె

బొత్తిగా కానరాకున్నావు కాని, ఓ భయశీలా! పుష్పమాలలనుండి గుబాళించుచున్నదైన ఈ పరిమళమును, కాలి అందెల చప్పుళ్ళూ నిన్ను పట్టిచ్చుచున్నవి."

ఇ) శ్లో॥ *రజనీతిమిరావగుణ్ఠితే-పురమార్గే ఘనశబ్దవిక్లబాః।*
*వసతిం ప్రియ కామినాం ప్రియా-స్త్వదృతే ప్రాపయితుం క ఈశ్వరః॥*

- కుమారసమ్భవమ్ - 4.11

రతీదేవి విలాపవర్ణనమున - "ఓ ప్రియుడా! రాత్రిపూట చీకటిచే ఆవరింపబడిన రాజమార్గమునందు, మేఘగర్జనచే భయపడిన అభిసారికలను కాముకుల ఇంటికి చేర్చుటకు నీవు తప్ప ఇంకొక సమర్థుడెవడు?"

భావసారూప్య-వైవిధ్యములను ఇచట గమనింతురు గాక.

ఈ) **కనకనికషస్నిగ్ధయా**

శ్లో॥ *నవజలధరః సన్నద్ధోఽయం, న దృప్తనిశాచరః*
*సురధనురిదం దూరాకృష్టం, న నామశరాసనమ్।*
*అయమపి పటుర్ధారాసారో, న బాణపరమ్పరా*
***కనకనికషస్నిగ్ధా** విద్యుత్ప్రియా, న మమోర్వశీ॥* -*విక్రమోర్వశీయమ్ 4.1*

".... ఇది ఒరపిడిరాయిపై గీయబడిన బంగారపు తీగవలె ఉజ్జ్వలమైన మెఱుపు తీగయే కాని నా ప్రియురాలు అగు ఊర్వశి కాదు."

**5) క్రియారూపము:-** 1) మా స్మ భూః > మా చ భూః
ఇచ్చోట మాచభూః పాఠాన్తరమునకే ఆనుగుణ్యము ఎక్కువ.

**6) అలంకారములు:-** ఈ శ్లోకమున 'కనకనికషస్నిగ్ధయా' అనుచోట - లుప్తోపమ. 2) 'తోయోత్సర్గస్తనితముఖరః' 'మాచభూః' -- అనుదానికి 'విక్లబాస్తాః' అనునది హేతువగుటవలన, ఇట 'వాక్యార్థహేతుక కావ్యలిఙ్గాలంకార'మున్నదని చెప్పదగును.

3) ఉభయాలంకారసంసృష్టి.

**సఞ్జీవినీవ్యాఖ్యా:-** ఇత్థం మహాకాలనాథస్య సేవాప్రకారమభిధాయ పునరపి నగరసఞ్చారప్రకారమాహ-గచ్ఛన్తీనామితి । తత్రోజ్జయిన్యాం నక్తం రాత్రౌ రమణవసతిం ప్రియభవనం ప్రతి గచ్ఛన్తీనాం యోషితామ్, అభిసారికాణామిత్యర్థః । సూచిభిర్భేద్యైః, అతి సాన్ద్రైరిత్యర్థః। తమోభిః రుద్ధాలోకే నిరుద్ధదృష్టిప్రసారే నరపతిపథే రాజమార్గే కనకస్య నికషో నికష్యత ఇతి వ్యుత్పత్త్యా నికష ఉపలగతరేఖా తస్యేవ స్నిగ్ధం తేజో యస్యాస్తయా। "స్నిగ్ధం తు మసృణే సాన్ద్రే రమ్యే క్లీబే చ తేజసి" - ఇతి శబ్దార్ణవే । సుదామ్నాద్రిణైకదిక్ సౌదామనీ విద్యుత్ । "తేనైకదిక్" (పా. 4. 3. 112) ఇత్యణ్ప్రత్యయః। తయా ఉర్వీం మార్గం దర్శయ । కిఞ్చ తోయోత్సర్గస్తనితాభ్యాం వృష్టిగర్జితాభ్యాం ముఖరః శబ్దాయమానో మా స్మ భూః। కుతః? తా యోషితో విక్లబా భీరవః, తతో వృష్టిగర్జితే న కార్యే ఇత్యర్థః । నాత్ర తోయోత్సర్గసహితం స్తనితమితి విగ్రహః । విశిష్టస్యేవ కేవలస్తనితస్యాప్యనిష్టత్వాత్ । న

చ ద్వన్ద్వపక్షేఽల్పాచ్తరపూర్వనిపాతశాస్త్రవిరోధః "లక్షణహేత్వోః క్రియాయాః" (పా. 3.2.126) ఇతి సూత్ర ఏవ విపరీతనిర్దేశేన పూర్వనిపాతశాస్త్రస్యానిత్యత్వజ్ఞాపనాదితి ॥ 37 ॥

**బ్రహ్మప్రకాశికావ్యాఖ్యా:-** గుణ్డిచామణ్డపేఽవస్థానానన్తరం హేరాఖ్యముత్సవమాహ -- గచ్ఛన్తీనామితి । హే శ్రీకృష్ణ! తత్ర గుణ్డిచాయాం యోషితాం స్త్రీణాం నరపతిః శ్రేష్ఠా మహాలక్ష్మీః । తస్యాం పథి దేవాలయాగ్రమార్గే నక్తం రాత్రౌ వలిగ్రాహకపురుషతుల్యైః సూచిభేద్యైస్తమోభిరన్ధకారైః రుద్ధాలోకే । భర్తుస్తవాన్యతో నయనాపరాధేన రుద్ధాః కారాగృహే స్థాపితాః, అస్య విష్ణోర్లోకాః సేవకా యస్మిన్నేవం భూతే సతి । రమణస్య తవ వసతిం గచ్ఛన్తీనాం లక్ష్మ్యా దూతీనాం, సుష్ఠు దామ సుదామ। తత్సమ్బన్ధిన్యా కనకనికషచ్ఛాయయా। అనుగ్రహదత్తాలఙ్కరణమాలాసమ్బన్ధి సువర్ణఖణ్డానాం కాన్త్యా ప్రదీప్తయా ఉర్వీం త్వం దర్శయ । తోయోత్సర్గకాలే యస్తనితః తేన ముఖరః మేఘః తద్వత్తాః ప్రత్యాక్రోశేన ముఖరో మా భూస్తాశ్చ విక్లూత్వా మా భూవన్ । (దీరావతి గోపశీతిరితి మేదినీకారః)?

**విద్యుల్లతావ్యాఖ్యా:-** అథ సన్ధ్యావసానే నివృత్తనివృత్తోత్సవస్య గౌరీపతేః సేవాయా అసమయత్వాదనౌచిత్యాన్మహాకాలతో నిర్గతస్యాస్య లలితం వ్యాపారాన్తరం విదధాతి -- గచ్ఛన్తీనామితి । గచ్ఛన్తీనాం న తు నీయమానానామ్ । అనేన సహాయరాహిత్యం ధ్వనితమ్। రమణవసతిం ప్రియతమమన్దిరమితి, స్మరశరబలాత్కారైణైకాకినీనాం తిమిరమ- విగణయ్యాపి గమనోద్యోగః శోభత ఇతి భావః । తత్ర ఉజ్జయిన్యామ్ । నక్తం రాత్రౌ ఇతి, ప్రియ ఇదానీమేష్యతీతి ప్రత్యాశయా కఞ్చిత్కాలం ప్రతీక్ష్య తదనాగమనం నిశ్చిత్య ప్రౌఢప్రదోషే నిర్గమం వ్యఞ్జయతి । రుద్ధాలోకే నిమ్నోతనిమ్నోన్నతాదిదర్శనే । నరపతిపథే రాజవీథ్యామ్ । సూచిభేద్యైః సూచిః శస్త్రవిశేషస్తీక్ష్ణాగ్రః, తయా భేత్తుం యోగ్యైః । అనేన బహులత్వాతిశయ ఉక్తః । సౌదామన్యా విద్యుతా । కనకనికషః హేమనికషణరేఖా తద్వత్ స్నిగ్ధయా, సాహచర్యాత్ కపిలయా చ, దర్శనమాత్రోపయుక్తయా న తు నయనప్రతిఘాతి న్యేత్యర్థః । తత్ క్షణే చ లోచనచాకిత్యస్యావశ్యమ్భావాత్ 'విద్యుద్దామస్ఫురణచకితైః' ఇత్యుక్త మనుసంహితమ్। తోయోత్సర్గో వర్షణమ్, తదర్థేన గర్జితేన, అథవా తోయోత్సర్గేణ స్తనితేన చ వాచాలః । మా భూః । కుతః? విక్లబాస్తాః । తచ్ఛబ్దః ప్రసిద్ధౌ, సౌకుమార్యాది గుణ విశిష్టా యోషితః పరామృశతి । విక్లబాః అధీరాః । యతో గమ్భీరభీషణే తవ గర్జితే జృమ్భమాణే ససంభ్రమపరిరమ్భోచితే దయితజనే చాసన్నిహితే తాసామతిసుకుమారీణామ చిన్తనీయాపి కాపి దశా సమ్భావ్యత ఇతి భావః । అత్ర ముఖరత్వవిక్లబత్వయోరతివైధర్మ్యా దఘటమానత్వమితి విషమాలఙ్కారః ॥ 37 ॥



శ్లో॥ తాం కస్యాఞ్చిద్భవనవలభౌ సుప్తపారావతాయాం
నీత్వా రాత్రిం చిరవిలసనాత్ఖిన్నవిద్యుత్కళత్రః।
సూర్యే దృష్టే పునరపి భవాన్వాహయేదధ్వశేషం
మన్దాయన్తే న ఖలు సుహృదామభ్యుపేతార్థకృత్యాః॥ 38

- మృణాలినీ వ్యాఖ్యా -

**పదవిభాగము:-** తామ్, కస్యాంచిత్, భవన-వలభౌ, సుప్త-పారావతాయామ్, నీత్వా, రాత్రిమ్, చిర-విలసనాత్, ఖిన్న-విద్యుత్-కలత్రః। సూర్యే, దృష్టే, పునః,+అపి, భవాన్, వాహయేత్, అధ్వ-శేషమ్, మన్దాయన్తే, న, ఖలు, సుహృదామ్, అభ్యుపేత+అర్థకృత్యాః॥

**ప్రతిపదార్థము:-** హే మేఘ! - ఓ మేఘుడా!

చిరవిలసనాత్ = చాలసేపు మెఱయుటవలన,
ఖిన్న-విద్యుత్-కళత్రః= అలసిన మెఱుపే భార్యగాగల,
భవాన్ = నీవు,
సుప్తపారావతాయామ్ = నిద్రించుచున్న పావురములుగల,
కస్యాఞ్చిత్ = ఏదో ఒక,
భవన-వలభౌ = భవన ఉపరిభాగమునందు,
తామ్ = ఆ
రాత్రిమ్ = రాత్రిని,
నీత్వా = గడిపి,
సూర్యే = సూర్యుడు,
దృష్టే(సతి) = కనబడగా,
పునః+అపి = తిరిగి,
అధ్వ-శేషమ్ = మార్గశేషమును,
వాహయేత్ = నిర్వహింతువు గాక,
సుహృదామ్ = మిత్రులయొక్క
అభ్యుపేత+అర్థకృత్యాః= పని సఫలమగువఱకు చేతుమని అంగీకరించినవారు,
న మన్దాయన్తే ఖలు = ఆలస్యము చేయరుగదా!

**తాత్పర్యము:-** ఓ మేఘుడా! చాలసేపు మెఱయుటవలన అలసిన మెఱుపే భార్యగా గల నీవు, నిద్రించుచున్న పావురములుగల ఏదో ఒక భవనోపరిభాగమునందు ఆ రాత్రిని గడిపి, సూర్యుడు కనబడగా, తిరిగి మార్గశేషమును నిర్వహింతువుగాక. మిత్రుల యొక్క పని సఫలమగువఱకు చేతుమని అంగీకరించినవారు ఆలస్యము చేయరుగదా!

- పదాదర్శః -

**1) విభక్తులు-అవ్యయములు-కృత్తులు-క్రియలు:-**

చిరవిలసనాత్-(స.ఏ.), ఖిన్నవిద్యుత్కళత్రః-(ప్ర.ఏ.), భవాన్-(ప్ర.ఏ.), సుప్తపారావతాయామ్-(స.ఏ.), కస్యాఞ్చిత్-(స.ఏ.), భవనవలభౌ-(స.ఏ.), తామ్-(ద్వి.ఏ.), రాత్రిమ్-(ద్వి.ఏ.), నీత్వా-కృత్తు, సూర్యే-(స.ఏ.), పునః, అపి-(అవ్య.), అధ్వ- శేషమ్ -(ద్వి.ఏ.), వాహయేత్-(క్రియ), సుహృదామ్-(ష.బ.), అభ్యుపేతార్థకృత్యాః -(ప్ర.బ.), న-(అవ్య.), మన్దాయన్తే-(క్రియ), ఖలు-(అవ్య.).

**2) సమాసములు:-**

అ) భవనస్య వలభః, తస్యామ్ (ష.త.) భవనవలభౌ.

ఆ) సుప్తాః పారవతా యస్యాం తస్యామ్ -(బహువ్రీహిః) సుప్తపారవతాయామ్।

ఇ) చిరం విలసనం, తస్మాత్ సుప్సుపాసమాసః, హేతోః పఞ్చమీ,

ఈ) విద్యుదేవ కళత్రమ్ (రూపకసమాసః), విద్యుత్కళత్రమ్, ఖిన్నం విద్యుత్కళత్రమ్ యస్య సః, ఖిన్నవిద్యుత్కళత్రః (బహువ్రీహిః).

ఉ) అధ్వనః శేషః, తమ్ (ష.త.) అధ్వశేషమ్.

ఊ) అభ్యుపేతా అర్థస్య కృత్యా యైః తే, అభ్యుపేతకృత్యాః (బహువ్రీహిః)

**3) పాఠాంతరములు:-** 1) భవనవలభౌ > భవనవడభౌ, భువనవలభౌ,
2) పారావతాయామ్ > పారాపతాయామ్.

**4) పదవ్యుత్పత్తి-నిఘంటుప్రమాణములు-కావ్యప్రయోగములు:-**

**అ) భవనవలభౌ** - సుప్తపారావతాయామ్.

శ్లో॥ *పత్త్రచ్ఛాయాసు హంసా ముకులితనయనా దీర్ఘికా పద్మినీనాం*
*సౌధాన్యత్యర్థతాపాద్వలభిపరిచయద్వేషి పారావతాని।*
*బిన్దూత్క్షేపాన్పిపాసుః పరిసరతి శిఖీ భ్రాన్తి మద్వారియన్త్రమ్*
*సర్వైరుస్రైః సమగ్రైస్త్వమివ నృపగుణై ర్దీప్యతే సప్తసప్తిః॥* - *మాళవికాగ్నిమిత్రమ్-2.12*

"సరస్సులయందలి పద్మపత్రముల నీడలయందు హంసలు కన్నులు మూసికొని (విశ్రాన్తికై)యున్నవి. అధికతాపమువలన భవనపుముంజూరులయందు నివసించుటకు పారావతములిష్టపడకున్నవి. పైకెగజిమ్ముచున్న నీటిబిందువులను త్రావగోరి, మయూరము గిరగిర తిరుగుచున్న జలయంత్రమును చేరుచున్నది...."

**ఆ) మన్దాయన్తే న ఖలు సుహృదామభ్యుపేతార్థకృత్యాః॥**

1) శ్లో॥ *కిం శేషస్య భరవ్యథా న వపుషి క్ష్మామం న క్షిపత్యేషయత్*
*కిం వా నాస్తి పరిశ్రమో దినపతేరాస్తే న యన్నిశ్చలః॥*
***కిం త్వఙ్గీకృతముత్సృజన్కృపణవచ్ఛ్లాఘ్యో జనో లజ్జతే***
***నిర్వాహః ప్రతిపన్నవస్తుషు సతామేతద్ధి గోత్రవ్రతమ్॥***

"..... an honourable man feels ashamed to leave off, like a mean fellow what has been (once) undertaken. Seeing the tasks undertaken through - this itself (is) the family Vow of the Good.

గొప్పవారు పూనుకొన్నపనిని చేయుదురేగాని మానరు. - ముద్రారాక్షసే*2.18 (Karmarkar)*

2) శ్లో॥ *సదా చరతి తిగ్మాంశుః సదా వహతి మారుతః।*
*సదా దత్తే భువం శేషః సదా ధీరోఽవికత్థనః॥*

అను సుభాషితమును ఇచట అనుసంధానము చేసికొనదగును.

**5) క్రియారూపము:-** 1) వాహయేత్, 2) మన్దాయన్తే

అ)వహ (వహ్) ప్రాపణే, మోయుట (సకర్మకము), ప్రవహించుట (అకర్మకము), అనిట్, ఉభయపదీ. భ్వాదిప్రకరణమ్.

ణిజన్తమ్ - ప్రయోజకవ్యాపారమునుగాని, ప్రేరణార్థకమునుగాని చెప్పుటకు ధాతువుపై ణిచ్ (ఇ) ప్రత్యయము చేరును. హేతుమతి చ 3-1-26.

ఈ ణిజన్తము సనాద్యన్తాధాతవః(3.1.32) సూత్రముచే ధాతుసంజ్ఞ కలిగియుండుట వలన దీనిపై లడాదులు వచ్చును. ఇవి ఉభయపదులు.

ణిచ్-విధిలిఙ్ ప్ర.పు.ఏ., **వాహయేత్**-వాహయేతామ్-వాహయేయుః

ఆ)ధాతువులపై కొన్ని ప్రత్యయయములు చేరుటవలన సుబంతములేర్పడినట్లుగ, సుబంతములపై కొన్ని ప్రత్యయములు చేరుటవలన ధాతువు లేర్పడును. నామములపై అర్థవిశేషములో ప్రత్యయముచేరగా ఏర్పడునది నామధాతువు.

మన్దాభవన్తీతి, 1) లోహితాదిడాజ్భ్యః క్యష్, 2) 'వా క్యషః' లచే ఆత్మనేపదీ-లట్ -ప్రథమపురుషబహువచనమ్-మన్దాయన్తే.

**6) అలంకారములు:-** ఈ శ్లోకమున 1) మెఱుపునందు కళత్రారోపణ, మేఘునియందు పతిత్వారోపణము వలన రూపకమును, 2) చతుర్థపాదమున సామాన్యముచే విశేషార్థ సమర్థనము వలన అర్థాన్తరన్యాసమును, 3) ఉభయమునకు అంగాంగి భావమగుట వలన సంకరాలంకారమును చెప్పదగును.

1) రూపకలక్షణమ్ : శ్లో॥ *ఏకత్ర రూపణం యత్స్యాదుపమానోపమేయయోః।*
*రూపకం నామ తచ్చాపి బహుభేదయుతం యథా॥*

2) అర్థాన్తరన్యాస ల.: శ్లో॥ *ప్రస్తుతార్థస్య సిద్ధ్యర్థం విన్యాసోర్థాన్తరస్య యః।*
*అసావర్థాన్తరన్యాసో భిద్యతే బహుధా యథా॥*

3) సంకరలక్షణమ్ : శ్లో॥ *నానాలఙ్కారసంయోగాత్కథ్యతే సఙ్కరో యథా॥*

- ఇతి అలఙ్కారసఙ్గ్రహే - పఞ్చమః పరిచ్ఛేదః - 22,25,49

**సఞ్జీవినీవ్యాఖ్యా:-** తామితి । చిరం విలసనాత్స్ఫురణాత్ఖిన్నం విద్యుదేవ కలత్రం యస్య స భవాన్ సుప్తాః పారావతాః కలరవా యస్యాం తస్యామ్, వివిక్తాయామిత్యర్థః। "పారావతః కలరవః కపోతః" ఇత్యమరః । జనసఞ్చారస్త్రాసమ్భావిత ఏవేతి భావః । కస్యాం చిద్భవనవలభౌ, గృహాచ్ఛాదనోపరిభాగ ఇత్యర్థః । "ఆచ్ఛాదనం స్యాద్వలభీ గృహాణామ్" ఇతి హలాయుధః। తాం రాత్రిం నీత్వా సూర్యే దృష్టే సతి, ఉదితే సతీత్యర్థః। పునరప్యధ్వశేషం వాహయేత్। తథా హి - సుహృదాం మిత్రాణామభ్యుపేతార్థస్యాఙ్గీకృతార్థస్య ప్రయోజనస్య కృత్యా క్రియా యైస్తే,అభ్యుపేతసుహృదర్థా ఇత్యర్థః। సాపేక్షత్వేఽపి గమకత్వాత్సమాసః। "కృత్యా క్రియాదేవతయోః కార్యే స్త్రీ కుపితే త్రిషు" ఇతి యాదవః । "కృఞః శ చ"

(పా. 3.3.100) ఇతి చకారాత్క్యప్। న మన్దాయన్తే ఖలు న మన్దా భవన్తి హి, న విలమ్బ ఇత్యర్థః। "లోహితాదిడాజ్భ్యః క్యష్" (పా. 3.1.13) ఇతి క్యష్। "వా క్యషః" (పా. 1.3.90) ఇత్యాత్మనేపదమ్ ॥ 38 ॥

**బ్రహ్మప్రకాశికావ్యాఖ్యా:–** తామితి – దుర్గస్థానే నృపాదీనాం కలత్రం శ్రోణిభార్యయోరితి రభసః । హే శ్రీకృష్ణ! గుణ్డిచాం ప్రతిగమనే ప్రత్యాగమే వా యది రాత్రిర్భవేత్తదా కస్యాశ్చిద్భవనవలభౌ ఉచ్చమణ్డపే సుప్తాః పారావతాః । అర్శ అద్యన్తా గోపగీతిమన్తో రథస్య వాహకా కాలపృష్ఠాఖ్యా జనా యస్యాం ఏవం భూతాయాం సత్యాం చిరవిలస-నాద్వహుకాలం వ్రజద్రథస్య నతోన్నతేషు క్షేపావక్షేపయోర్విలాసాదుదయాత్ఖిన్నం విద్యుద్విద్యోతమానం సుకుమారం కలత్రం శ్రోణీర్యస్య । విద్యుదితి కర్తరి క్విప్ । డలయోరైక్యాత్ విశాం మనుజానాం కాలపృష్ఠానామసనాదుపద్రవాత్ ఖిన్నం విద్యుత్కలత్రం దుర్గస్థానం యస్యేతి వా। భవాన్ తాం రాత్రిం మార్గ ఏవ నీత్వా సూర్యే దృష్టే సతి పునరప్య ధ్వశేషం వాహయేత్।తత్ర హేతుః। ఖలు యస్మాత్ సుహృదాం భక్తానామభ్యుపేతార్థ కృత్యాః। స్వీకృతప్రార్థనా మహాన్తో న మన్దాయన్తే। నాన్యథా కుర్వన్తి ॥ 38 ॥

**విద్యుల్లతావ్యాఖ్యా:–** అథానుభూతోజ్జయినీరసచరితార్థస్యాస్యానన్తరకరణీయమాహ –– తామితి। తాం యా పరమేశ్వరసేవాయై ప్రతిపాలితా నీతభూయిష్ఠా చ తామ్। కస్యాశ్చి దితి, సర్వత్ర వాససౌఖ్యం ద్యోతయతి । భవనవలభౌ గృహవిటఙ్కికాయామ్ । అథవా భవనకూటేషు । 'కూటాకారం తు వలభిః' ఇతి వైజయన్తీ । సుప్తపారావతాయాం సుఖసుప్తానాం కలరవాణామనుపమర్దేనేత్యర్థః। అథవా తత్సవర్ణతయా కైశ్చిదప్యపరిజ్ఞాత ఇతి। రాత్రిం నీత్వా న పునః ఖేదం నీత్వా, ఖేదనయనస్య పూర్వమేవోక్తత్వాత్, రాత్రినయన మేవ తదానీం తవాపేక్షితమితి భావః । చిరవిలసనాత్ మార్గప్రదర్శనసంరమ్భేణ చిరకాలపరిస్ఫురణాత్। ఖిన్నవిద్యుత్కలత్రః పరిశ్రాన్తా విద్యుద్రూపా భార్యా యస్య, భవతః శ్రమాభావేఽపి తదర్థమపి క్వచిద్విశ్రమో యుక్త ఇతి భావః । సూర్యే దృష్ట ఇతి, న త్వరుణోదయమాత్రే, అనేన తరుణకిరణకబలితతమసి గగనసరణిమశిశిరమహసి సముపసరతి సతి దివసముఖవితతలలితవివిధచరితభరితమధికరుచిరమవనిపనగరం తదతికుతుకజననమనుభూయైవ గన్తవ్యమితి ద్యోత్యతే । పునరపి ఉజ్జయినీమహాకాల దర్శనోత్సవనివృత్తోఽపీతి, పునఃశబ్దో వ్యావృత్తౌ। 'పునరప్రథమే ప్రశ్నే వ్యావృత్తావవధారణే' ఇతి వైజయన్తీ। ప్రస్తుతస్య మార్గస్య భూయోఽపి గమనమిత్యర్థో న ఘటతే, శేషశబ్దేన పౌనరుక్త్యాపత్తేః। వాహయేత్ గమయేద్ గచ్ఛేత్ వా, 'నిశాసు భాస్వత్కలనూపురాణాం యః సఞ్చరోఽభూదభిసారికాణామ్। జ్వలన్ముఖోల్కావిచితామిషాభిః స వాహ్యతే రాజపథః శివాభిః' ఇత్యత్ర వాహ్యత ఇతివత్। అధ్వశేషం మార్గస్యావశిష్టమేకదేశమ్ । శేషశబ్దే నోపయుక్తేతరస్యాభిధానాత్ తస్య చార్థాన్న్యూనత్వసిద్ధేర్లక్షితభూయిష్ఠత్వాన్మార్గస్య కియానేవ శేషః, అతో లాఘవాల్లఙ్ఘన స్సౌకర్యేణ న తన్మన్దాలుత్వావకాశ ఇతి ప్రోత్సాహనమ్।

ప్రసిద్ధసుజనసౌహృదస్వభావోద్భావనేనాపి ప్రోత్సాహయతి, అథవా అభిరుచితదేశాదిదర్శనే కథమవిలమ్బితనిర్గమ ఇతి చేత్తత్రాహ--మన్దాయన్తే అపటువదాచరన్తి, ఉదాసత ఇతి యావత్ । 'మూఢాత్మాపటునిర్భాగ్యా మన్దాః' ఇతి వైజయన్తీ । ఖలుః అనునయే । 'నిషేధవాక్యాలఙ్కారే వీప్సానునయోః ఖలు' ఇతి వైజయన్తీ। సుహృదాం అశఠ హృదయానాం మిత్రాణామ్। అభ్యుపేతార్థకృత్యాః ఏవం కరిష్యామీతి ప్రతిశ్రుత -ప్రయోజనానుష్ఠానాః , 'సుహృదర్థం ప్రతిశ్రుత్య యశ్చ పశ్చాదకుర్వతామ్। తేన పాపేన లిప్యేయం యద్యహం నాగమే పునః॥' ఇతి మహాభారతే మహాపాతకత్వోక్తేః,దధీచాదీనాం తథానుష్ఠానాచ్చేతి భావః। అత్రార్థాన్తరన్యాసోఽలఙ్కారః॥ 38 ॥



శ్లో॥ తస్మిన్కాలే నయనసలిలం యోషితాం ఖణ్డితానాం
శాన్తిం నేయం ప్రణయిభిరతో వర్త్మ భానోస్త్యజాశు।
ప్రాలేయాస్రం కమలవదనాత్సోఽపి హర్తుం నలిన్యాః
ప్రత్యావృత్తస్త్వయి కరరుధి స్యాదనల్పాభ్యసూయః॥ 39

- మృణాలినీ వ్యాఖ్యా -

**పదవిభాగము:-** తస్మిన్+కాలే, నయన-సలిలమ్, యోషితామ్, ఖణ్డితానామ్, శాన్తిమ్, నేయమ్, ప్రణయిభిః,+అతః, వర్త్మ, భానోః,+త్యజ, ఆశు। ప్రాలేయ+అస్రమ్, కమల-వదనాత్,సః,+అపి, హర్తుమ్, నలిన్యాః, ప్రతి+ఆవృత్తః+త్వయి, కర-రుధి, స్యాత్, అనల్ప+అభ్యసూయః॥

**ప్రతిపదార్థము:-** హే మేఘ! - ఓ మేఘుడా!

| | | |
|---|---|---|
| తస్మిన్కాలే | = | ప్రభాతసమయమునందు, |
| ప్రణయిభిః | = | ప్రియతములచేత, |
| ఖణ్డితానామ్ | = | ఖణ్డితలను, |
| యోషితామ్ | = | స్త్రీలయొక్క, |
| నయన-సలిలమ్ | = | కన్నీటి, |
| శాన్తిమ్ | = | శమనమును, |
| నేయమ్ | = | పొందింపవలయును. |
| అతః | = | కన్క, |
| భానోః | = | సూర్యునియొక్క |
| వర్త్మ | = | మార్గమును, |
| ఆశు | = | శీఘ్రముగ, |
| **త్యజ** | = | విడువుము, |
| అన్యథా | = | అట్లుకాదేని, |
| నలిన్యాః | = | తామరతీగయొక్క |
| కమలవదనాత్ | = | పద్మవదనము నుండి, |

ప్రాలేయ+అస్రమ్ = మంచు బిందువులను,
హర్తుమ్ = పోగొట్టుటకు,
ప్రత్యావృత్తః = తిరిగివచ్చిన,
సః+అపి = ఆ సూర్యుడును,
త్వయి = నీవు,
కర-రుధి (సతి) = కిరణములను అడ్డగించితివేని,
అనల్ప+అభ్యసూయః = అధికమగు ద్వేషము కలవాడు,
స్యాత్ = అగును.

**తాత్పర్యము:-** ఓ మేఘుడా! ఆ ప్రభాతసమయమునందు ప్రియతములచేత ఖణ్డితలను స్త్రీలయొక్క కన్నీటి శమనమును పొందింపవలయును. కనక సూర్యునియొక్క మార్గమును శీఘ్రముగా విడువుము. కాదేని తామరతీగయొక్క పద్మవదనమునుండి మంచుబిందువులను పోగొట్టుటకు తిరిగి వచ్చిన ఆ సూర్యుడును, నీవు కిరణములను అడ్డగించితివేని, అధికమగు ద్వేషముకలవాడు అగును.

**- పదాదర్శః -**

**1) విభక్తులు-అవ్యయములు-కృత్తులు-క్రియలు:-**

తస్మిన్కాలే-(స.ఏ.),ప్రణయిభిః-(తృ.బ.), ఖణ్డితానామ్-(ష.బ.), యోషితామ్-(ష.బ.) నయనసలిలమ్-(ద్వి.ఏ.), శాన్తిమ్-(ద్వి.ఏ.), నేయమ్-(ప్ర.ఏ.), అతః-(అవ్య.), భానోః -(ష.ఏ.), వర్త్మ-(ద్వి.ఏ.), ఆశు-(అవ్య.), త్యజ-(క్రియ), అన్యథా- (అవ్య.), నలిన్యాః -(ష.ఏ.), కమలవదనాత్-(పం.ఏ.), ప్రాలేయాస్రమ్-(ప్ర.ఏ.), హర్తుమ్-(కృత్తు), ప్రత్యావృత్తః-(ప్ర.ఏ.), సః-(ప్ర.ఏ.), అపి-(అవ్య.), త్వయి-(స.ఏ.), కరరుధి-(స.ఏ.), అనల్పాభ్యసూయః-(ప్ర.ఏ.), స్యాత్-(క్రియ).

**2) సమాసములు:-**

అ) నయనయోః సలిలమ్, నయనసలిలమ్ (ష.త.)
ఆ) ప్రాలేయం ఏవ అస్రమ్, తత్, (రూపకసమాసః) ప్రాలేయాస్రమ్.
ఇ) కమలమ్ ఏవ వదనమ్, తత్ (రూ.స.) కమలవదనమ్, తస్మాత్ కమలవదనాత్।
ఈ) న అల్పా, అనల్పా (నఞ్), అనల్పా అభ్యసూయా యస్య సః, (బహువ్రీహిః).

**3) పాఠాంతరములు:-** 1) ప్రాలేయాస్రమ్ > ప్రాలేయాశ్రు, ప్రాలేయాశ్రమ్.
2) కమలవదనాత్ > కమలనయనాత్.

**4) పదవ్యుత్పత్తి-నిఘంటుప్రమాణములు-కావ్యప్రయోగములు:-**

**అ) ఖణ్డితానామ్** - ఖణ్డితా

1) "*ఏతాః షోడశాప్యష్టాభిరవస్థాభిః ప్రత్యేక మష్టవిధాః - ప్రోషితభర్తృకా,* ***ఖణ్డితా,*** *కలహాన్తరితా, విప్రలబ్ధా, ఉత్కణ్ఠితా, వాసకసజ్జా, స్వాధీనపతికా, అభిసారికా, చేతి, గణనాదష్టావింశత్యధిక శతం భవన్తి. తాసామ-*

*ప్యుత్తమమధ్యమాభేదగణనయా చతురధికాశీతియుతశతత్రయం భేదాభవన్తి." (384)* భేదములు.

**'ఖణ్డితా'** లక్షణమ్ – *అన్యోపభోగసఞ్చిహ్నితః ప్రాతరాగచ్ఛతి పతిర్యస్యాః సా ఖణ్డితా. ప్రాతరిత్యుపలక్షణమ్. అస్యాశ్చేష్టాః అస్ఫుటాలాప,చిన్తా,సన్తాప, నిఃశ్వాస, తూష్ణీమ్భా వాశ్రుపాతాదయః।* – రసమఞ్జరి–ద్వితీయప్రకరణమ్.

2) *వ్యాసఙ్గాదుచితే యస్యా వాసకే నాగతః ప్రియః।*
*తదనాగమదుఃఖార్తా **ఖణ్డితా** సా ప్రకీర్తితా॥* – *భరతః*

3) *ఉన్నిద్రతాజనితరాగవిలోభితాఙ్గః–కాన్తానఖక్షతవిశేషవిచిత్రితాఙ్కః।* (శుభఙ్కరః)
*యస్యాః కృతేఽపి గృహమేతి పతిఃప్రభాతే–సా నాయికా నాగదితా ఖలు **ఖణ్డితేతి॥***

ఆ) **అభ్యసూయః > అసూయా**

1) అష్టాధ్యాయీ (1.4.37) i) క్రుధద్రుహేర్ష్యాసూయార్థానాం యం ప్రతికోపః ii) కారకే సంప్రదానమ్, iii) రాజాచౌరాయ క్రుధ్యతి, ఖలః సజ్జనాయ ద్రుహ్యతి మాతా పుత్రాయ రుష్యతి, శ్యామః కృష్ణాయ ఈర్ష్యతి దేవః మోహనాయ అసూయతి.

2) అష్టాధ్యాయీ (3.4.28) i) యథాతథయోరసూయా ప్రతివచనే. ii) సిద్ధా ప్రయోగః,కృఞః,ణముల్। iii) యథాకారమహం భోక్ష్యే తథాకారమహం భోక్ష్యే.

3) అష్టాధ్యాయీ (8-1-8) i) వాక్యాదేరామన్త్రితస్యాసూయాసమ్మతికోప కుత్సన భర్త్సనేషు. ii) సర్వస్య ద్వే. iii) మాణవక మాణవక రిక్తం తే ఆభిరూప్యమ్ –'అసూయార్థము'.

4) *శ్లో॥ జాతః కులే తస్య కిలోరుకీర్తిః–కులప్రదీపో నృపతి ర్దిలీపః।*
*అతిష్ఠదేకోనశతక్రతుత్వే–శక్రాభ్యసూయా వినివృత్తయే యః॥* – ర.వం.6.74

"…..దేవేంద్రుని అసూయను తొలగించుటకై ఒకటి తక్కువ వందయాగములను ఆ దిలీపుడు నిర్వర్తించినాడు."

5) *శ్లో॥ కేనాభ్యసూయాపదకాంక్షిణా తే–నితాన్తదీర్ఘైర్జనితా తపోభిః।*
*యావద్భవత్యాహితసాయకస్య–మత్కార్ముకస్య నిదేశవర్తీ* – కు.సం.3.4

"ఇంద్రపదవిని కాంక్షించు ఎవడు తన నిరంతర దీర్ఘతపములతో నీకు అసూయను కలిగించుచున్నాడో చెప్పుము. ...."

**5) క్రియారూపములు:–** 1) త్యజ, 2) స్యాత్.

అ) త్యజ (త్యజ్) హానౌ (విడుచుట)–సకర్మకమ్, భ్వాదిప్రకరణమ్, అనిట్, పరస్మైపదీ. లోట్ – మధ్యమపురుషైకవచనమ్, **త్యజ/త్యజతాత్**–త్యజతమ్–త్యజత.

అ)అస(అస్) భువి (ఉండుట)-అకర్మకమ్, అదాదిప్రకరణమ్, అనిట్, పరస్మైపదీ.
విధిలిజ్-ప్రథమపురుషైకవచనమ్, **స్యాత్**-స్యాతామ్-స్యుః.

**6) అలంకారములు:-** ఇందు 1) 'సూర్యగమనమార్గమును విడువుము' అనుదానికి ఉత్తరార్ధము హేతువగుటవలన (వాక్యార్థహేతుక) **కావ్యలిఙ్గాలఙ్కారము**ను, 2)లింగ సామ్యమున నళినీ భాస్కరులయందు నాయికా నాయక వ్యవహారారోపణమున **సమాసోక్త్యలఙ్కారము**ను, 3) కరరుధి యనుచోట శ్లేషను, 4) అంగాంగి భావమున **సఙ్కరాలఙ్కారము**న్ను చెప్పదగును.

1) **కావ్యలిఙ్గమ్-** *శ్లో॥ సమర్థనీయస్యార్థస్య కావ్యలిఙ్గం సమర్థనమ్।*
*జితోఽసి మన్దకన్దర్ప! మచ్చిత్తేఽస్తి త్రిలోచనః॥ -చన్ద్రాలోకః(60)*

సమర్థనీయమైన యర్థమునకు సమర్థనము కావ్యలింగము.

2) **సమాసోక్త్యలఙ్కారలక్షణమ్** - సూ:- **అనుక్తౌ సమాసోక్తిః**(3)

మూ.:- ఉపమేయస్యానుక్తౌ సమానవస్తున్యాసః సమాసోక్తిః సంక్షేప వచనాత్సమాసోక్తి రిత్యాఖ్యా.

(ఉపమేయమును), చెప్పకున్నచో సమాసోక్తి. ఉపమేయమును చెప్పకుండనే సమాన వస్తువుయొక్క న్యాసము సమాసోక్తి. ఉపమానమును మాత్రమే చెప్పగా ఉపమేయము గమ్యమగును అని యర్థము. విస్తృతార్థమును సంక్షిప్తముగ చెప్పుటచే సమాసోక్తి యని పేరు.

3) **శ్లేషలక్షణమ్:** సూ.:- **స ధర్మేషు తన్త్రప్రయోగే శ్లేషః** (7).

మూ.:- ఉపమానోపమేయస్య ధర్మేషు గుణక్రియాశబ్దరూపేషు స తత్త్వాధ్యారోపః తన్త్రప్రయోగే తన్త్రోచ్చారణే సతి శ్లేషః.

"ధర్మముల విషయమున తంత్రప్రయోగము ఉండగా, అది శ్లేష. గుణక్రియాశబ్ద రూపములగు ధర్మములను తంత్రముచే ఉచ్చరించినపుడు, ఉపమానముతో ఉపమేయమునకు అభేదారోపము శ్లేష. రెండు విషయములను ఒక్కపదముచే ప్రతిపాదించుటకు తంత్రమని పేరు. ధర్మము గుణరూపముగాని, క్రియారూపము గాని, శబ్దరూపముగాని కావచ్చును. గుణాదిరూపముననున్న ఈ ధర్మములను ఒకే పదముచే బోధించుటచే ఉపమానోపమేయములు రెండింటికిని అన్వయించు అట్టి ధర్మములద్వారా వానికి (ఉపమానోపమేయములకు) అభేదారోపము సిద్ధించినచో అది 'శ్లేష' యని అర్థము. - కావ్యాలఙ్కారసూత్రాణి-4, బాలానన్దినీవ్యాఖ్యా

**సఞ్జీవినీవ్యాఖ్యా:-** తస్మిన్నితి । తస్మిన్కాలే పూర్వోక్తే సూర్యోదయకాలే ప్రణయిభిః ప్రియతమైః ఖణ్డితానాం యోషితాం నాయికావిశేషాణామ్, "జ్ఞాతేఽన్యాసఙ్గవికృతే ఖణ్డితేర్ష్యాకషాయితా" ఇతి దశరూపకే (2.24)। నయనసలిలం శాన్తిం నేయం నేతవ్యమ్।

నయతిర్ద్వికర్మకః। అతో హేతోర్భానోర్వర్త్మాశు శీఘ్రం త్యజ, తస్యావరకో మా భూరిత్యర్థః। విపక్షేఽనిష్టమాచష్టే - సోఽపి భానుః, నలాన్యమ్బుజాని యస్యాః సన్తీతి నలినీ పద్మినీ। "తృణేఽమ్బుజే నలం నా తు రాజ్ఞి నాలే తు న స్త్రియామ్" ఇతి శబ్దార్ణవే। తస్యాః స్వకాన్తాయాః కమలం స్వకుసుమమేవ వదనం తస్మాత్ ప్రాలేయం హిమమేవాస్రమశ్రు హర్తుం శమయితుం ప్రత్యావృత్తః ప్రత్యాగతః, నలిన్యాశ్చ భర్తుర్భానోర్దేశాన్తరే నలిన్యన్తర గమనాత్ఖణ్డితత్వమిత్యాశయః। తతస్త్వయి। కరానంశూన్ రుణద్ధీతి కరరుత్। క్విప్। తస్మిన్కరరుధి సతి। హస్తరోధిని సతీతి చ గమ్యతే। 'బలిహస్తాంశవః కరాః' ఇత్యమరః। అనల్పాభ్యసూయోఽధికవిద్వేషః స్యాత్। ప్రాయేణేచ్ఛావిశేషవిఘాతాద్ద్వేషో రోషవిశేషశ్చ కామినాం భవతీతి భావః।కిఞ్చ 'ఆత్మానం చార్కమీశానం విష్ణుం వా ద్వేష్టి యో జనః। శ్రేయాంసి తస్య నశ్యన్తి రౌరవం చ భవేద్ధ్రువమ్।" ఇతి నిషేధాత్కార్యహానిర్భవిష్యతీతి ధ్వనిః ॥ 39 ॥

**బ్రహ్మప్రకాశికావ్యాఖ్యా:-** తస్మిన్ కాల ఇతి। హే శ్రీకృష్ణ! తస్మిన్ ప్రాతఃకాలే యాత్రా సమ్మర్దేన ఖణ్డితానాం రాత్రౌ విచ్ఛిద్యాన్యతో గతానాం యోషితాం యాత్రికస్త్రీణాం ప్రణయి-భిర్యాత్రిభిర్నయనసలిలం శాన్తిం నేయమ్। అతో భానోర్వర్త్మ ఆశు త్యజ, స చ స్వభార్యాయాః నలిన్యాః రాత్రౌ ఖణ్డితాయాః ప్రాతః పున-ర్దృష్టాయాః కమలమేవ నయనం తస్మాత్ప్రాలేయమేవాస్రం హర్తుం ప్రవృతః। త్వయి రథచ్ఛాయయా కరరుధికరం కిరణమేవ హస్తం రున్ధతి సతి తామప్రాప్య ప్రత్యావృత్తః సన్నర్థాదాత్మని అనల్పాభ్యసూయః స్యాత్। రథే చలితే తథా న స్యాదితి పునర్గచ్ఛేతి భావః ॥ 39 ॥

**విద్యుల్లతావ్యాఖ్యా:-** అథ ప్రతిష్ఠమానస్యాస్య పథికమపి ప్రమాదం నిషేధతి -- తస్మిన్నితి। తస్మిన్ కాలే సూర్యదర్శనస్య ప్రస్తావాత్ ప్రభాత ఇతి లభ్యతే। 'జ్ఞాతేఽన్యాసఙ్గవిషయే ఖణ్డితేర్ష్యాకషాయితా' ఇత్యమరః। శాన్తిం నేయం ప్రణిపాతాదిప్రసాదనోపాయ ప్రయోగేణావేగాపనయాన్నివారణీయమ్। ప్రణయిభిరితి, ప్రసాదనసౌకర్యం ద్యోతయతి, ప్రణిపాతాదికమన్తరేణాపి తద్దర్శనమాత్రాన్మన్మథపరతన్త్రతయా ప్రసాదో లభ్యత ఇత్యర్థః। ప్రణయిభిరితి తేషామపి, తద్గతప్రేమనిగలయన్త్రితత్వాత్ ప్రమాదాపతితత్వమపరాధస్య, అతో నేయమితి ప్రసాదస్య ప్రయత్నతోఽప్యనుష్ఠేయత్వమ్। అతః అస్మాత్కారణాత్। వర్త్మ కిరణప్రసరణసరణిమ్, కరరుధీతి కిరణనివారణస్యైవ వక్ష్యమాణత్వాత్। ఆశు త్యజ ఝటిత్యపసరణేన వర్జయ, సర్వథా వర్జనస్య గగనతలే తపనమణ్డలమధోఽధో వర్తమానస్యాశక్యత్వాత్, అజ్ఞాతకిరణఘటనవిఘటనమపసరణీయమితి భావః। ప్రాలేయాస్రం రజనిసమయనిపతితతుహినకణనివహమయనయనజలమ్। 'తుషార-స్తుహినం హిమమ్। ప్రాలేయం మిహికా చ' ఇత్యమరః। అస్రశ్చాస్రశ్చ పుల్లిఙ్గౌ కేశేఽ చ రుధిరేఽశ్రుణి' ఇతి వైజయన్తీ। కమలవదనాత్ పద్మరూపాన్ముఖాత్। సోఽపి భానురపి,

యథాన్యే ప్రణయినః ప్రణయినీనామ్, తథా సూర్యోఽపీత్యపి సముచ్చయే । 'అపి సమ్భావనాప్రశ్నగర్హాశఙ్కా సముచ్చయే' ఇతి వైజయన్తీ । హర్తుం కరప్రమార్జనేనాపనేతుమ్। ప్రత్యావృత్తః రాత్రినివాసస్థానాదాగతః । కరరుధి కిరణచ్ఛాదకే, న తు కరస్పృశి, మన్దగమనేన చిరం కిరణప్రసారం నివారయతీత్యర్థః । శ్లేషాత్ హస్తనిరోధినీత్యపి స్ఫురతి। అనల్పాభ్యసూయః గాఢాన్తర్గతవిద్వేషః। యథా ప్రణయాపరాధగాఢకుపితాయాః ప్రియాయాః ప్రసాదనాయ ప్రయతమానే ప్రబలమదనబాణవరిక్షీణే ప్రాణేశ్వరే, తదీయహృదయమజానానః కశ్చిన్మిత్రజడః ప్రసరదశ్రుబిన్దుప్రబన్ధప్రకటితప్రసాదప్రక్రమం ప్రియావదనం ప్రమార్జయితుం ప్రసారితం పాణిం నివారయన్, కిమనయా ప్రసాదితయా వరాక్యేతి ప్రలపన్, ప్రభూతవిద్వేషభాజనం భవతి, తథా త్వమపి నీరసకోటౌ నిపతన్ భవిష్యసి, తత్తథా న కర్తవ్యమితి భావః । అత్ర సమాసోక్త్యలఙ్కారః ॥ 39 ॥



**శ్లో॥ గమ్భీరాయాః పయసి సరితశ్చేతసీవ ప్రసన్నే**
**ఛాయాత్మాపి ప్రకృతిసుభగో లప్స్యతే తే ప్రవేశమ్।**
**తస్మాదస్యాః కుముదవిశదాన్యర్హసి త్వం న ధైర్యా-**
**న్మోఘీకర్తుం చటులశఫరోద్వర్తనప్రేక్షితాని॥ 40**

**- మృణాలినీ వ్యాఖ్యా -**

**పదవిభాగము:-** గమ్భీరాయాః, పయసి, సరితః,+చేతసి,+ఇవ, ప్రసన్నే,
ఛాయాత్మా+అపి, ప్రకృతి-సుభగః, లప్స్యతే, తే, ప్రవేశమ్।
తస్మాత్, +అస్యాః, కుముద-విశదాని,+అర్హసి, త్వమ్, న, ధైర్యాత్,
+ మోఘీకర్తుమ్, చటుల-శఫర+ఉద్వర్తన-ప్రేక్షితాని॥

**ప్రతిపదార్థము:-** హే మేఘ! - ఓ మేఘుడా!

| | | |
|---|---|---|
| గమ్భీరాయాః | = | గంభీరయనెడు, |
| సరితః | = | నదియొక్క, |
| ప్రసన్నే | = | స్వచ్ఛమైన, |
| పయసి | = | నీటియందు, |
| ప్రసన్నే చేతసి ఇవ | = | నిర్మలమగు మనస్సునందువలె, |
| ప్రకృతిసుభగః | = | సహజసుందరమైన, |
| తే | = | నీయొక్క, |
| ఛాయాత్మా+అపి | = | ప్రతిబింబ స్వరూపమైనను, |
| ప్రవేశమ్ | = | చేరికను, |
| **లప్స్యతే** | = | పొందగలదు, |
| తస్మాత్ | = | అందువలన, |
| అస్యాః | = | ఈ నదియొక్క, |
| కుముద-విశదాని | = | తెల్లకలువలవలె శ్వేతవర్ణమగు, |

చటుల .... ప్రేక్షితాని = చంచలములైన మత్స్యములయొక్క పొరలుట యనెడు చూపులను,
త్వమ్ = నీవు,
ధైర్యాత్ = దిట్టతనమువలన,
మోఘీకర్తుమ్ = వ్యర్థముచేయుటకు,
న+అర్హసి > నార్హసి = తగవు

**తాత్పర్యము:-** ఓ మేఘుడా! 'గమ్భీరా' నదియొక్క స్వచ్ఛమైన నీటియందు, నిర్మలమగు మనస్సునందువలె, సహజసుందరమైన నీ యొక్క ప్రతిబింబస్వరూపమైనను చేరికను పొందగలదు. అందువలన ఈ నదియొక్క తెల్లకలువవలవలె శ్వేతవర్ణమగు చంచలములైన మత్స్యములయొక్క పొరలుట యనెడు చూపులను నీవు దిట్టతనము వలన వ్యర్థము చేయుటకు తగవు.

**- పదాదర్శః -**

**1) విభక్తులు-అవ్యయములు-కృత్తులు-క్రియలు:-**

గమ్భీరాయాః-(ష.ఏ.), సరితః-(ష.ఏ.), ప్రసన్నే-(స.ఏ.), పయసి-(స.ఏ.), చేతసి-(స.ఏ.), ఇవ-(అవ్య.), ప్రకృతిసుభగః-(ష.ఏ.), తే-(ష.ఏ.), ఛాయాత్మా- (ప్ర.ఏ.), అపి-(అవ్య.), ప్రవేశమ్-(ద్వి.ఏ.), లప్స్యతే-(క్రియ), తస్మాత్- (పం.ఏ.), అస్యా-(ష.ఏ.), కుముద-విశదాని-(ద్వి.బ.), చటుల...ప్రేక్షితాని -(ద్వి.బ.), త్వమ్-(ప్ర.ఏ.), ధైర్యాత్-(పం.ఏ.), మోఘీకర్తుమ్-(కృత్తు), న-(అవ్య.), అర్హసి-(క్రియ).

**2) సమాసములు:-**

అ) ఛాయా చాసౌ ఆత్మా చ ఛాయాత్మా, (కర్మధారయః)
ఆ) ప్రకృత్యా సుభగః ప్రకృతిసుభగః (తృ.త.)
ఇ) కుముదానీవ విశదాని, కుముదవిశదాని, (ఉపమానకర్మధారయః)
ఈ) శఫరాణాం ఉద్వర్తనాని, (ష.త.), చటులాని చ తాని శఫరోద్వర్తనాని, కర్మధారయః చటులశఫరోద్వర్తనాని ఏవ ప్రేక్షితాని, తాని, (రూపకసమాసః) చటుల..ప్రేక్షితాని.

**3) పాఠాంతరములు:-** 1) తస్మాదస్యాః > తస్మాత్తస్యాః, 2) చటుల > చపల, 3) శఫర > సఫర.

**4) పదవ్యుత్పత్తి-నిఘంటుప్రమాణములు-కావ్యప్రయోగములు:-**

అ) గమ్భీరాయాః :- "This must be the name of one of the small rivers with which the province of *Malava* abounds. "Wilson says that this river and the *Gandhavathi* in the vicinity of the temple of Shiva, which lately occured, are probably amongst the numerous and nameless brooks with which the province of *Malava* abounds. - *Nandargikar*

**ఆ) ఛాయాత్మాపి > ఛాయా**

1) ఉణాదిసూత్రమ్(4-110) మాఛాశసిభ్యో యః। మాయా, ఛాయా, శస్యమ్। వృ-ఛ్యతి ప్రకాశమితి ఛాయా, ప్రకాశావరణముత్కోచకప్రతిబిమ్బో వా।

2) శ్లో॥ *శాపాదసి ప్రతిహతా స్మృతిరోధరూక్షే*
*భర్తర్యపేతతమసి ప్రభుతా తవైవ।*
***ఛాయా** విభాతి న మలోపహతప్రసాదే,*
*శుద్ధే తు దర్పణతలే సులభావకాశా॥* - అ.శా. 7-32

"......అద్దముపై దుమ్ము పేరుకొనియున్నచో, దానిలో ప్రతిబింబము కనబడదు, కాని అద్దమును తుడిచి, శుభ్రము చేసినచో, దానిలో ప్రతిబింబము స్పష్టముగ కనబడును గదా!"

ఇ) **ధైర్యాత్ :-** ఇట 'మహామహోపాధ్యాయ', మల్లినాథసూరి ఇచ్చిన వివరణ అంత సబబుగ లేదని పలువురు వ్యాఖ్యతలు భావించుట గమనింపదగినది. ప్రొఫెసర్ ఈశ్వరచంద్ర విద్యాసాగరుని - అభిప్రాయమిచట ఇవ్వబడినది.

*"ధైర్యాద్ ధైర్యమాశ్రిత్య గమ్భీరాయా అనురాగలిఙ్గదర్శనేఽపి నిర్వికారచిత్తో భూత్వేత్యర్థః। మల్లినాథస్తు ధైర్యాద్ ధార్ష్ట్యాత్ ఇతి వ్యాఖ్యాతవాన్ తన్న సమీచీనమ్। ధైర్య శబ్దస్య ధార్ష్ట్యార్థే ప్రయోగస్యాదర్శనాత్ యథాశ్రుతార్థపరిత్యాగే ప్రమాణా-భావాశ్చ।"*

అ) **- శఫర - > శఫరః** - 1) శఫం రాతి, రా+క > వాచస్పత్యమే, స్త్రియామ్ జీష్.

2) శ్లో॥ *.....ప్రోష్ఠీ శఫరః శ్వేత కోలకే!* - అభిధానచిన్తామణి- 4.412.

3) శ్లో॥ *ఇతి దేహవిముక్తయే స్థితాం-రతిమాకాశభవా సరస్వతీ।*
***శఫరీం** హ్రదశోష విక్లబాం-ప్రథమావృష్టిరివాన్వకమ్పయత్॥* -కు.సం. 4.39

"దేహత్యాగమునకు నిశ్చయించుకొనిన రతీదేవితో ఆకాశవాణి, మడుగు ఎండుటచే తల్లడిల్లు బేడిసచేపను, తొలకరివానవలె అనుగ్రహించుచు పలికెను."

**5) క్రియారూపములు:-** 1) లప్స్యతే, 2) అర్చసి.

1) డులభష్ (లభ్) ప్రాప్తౌ (పొందుట)-సకర్మకమ్, భ్వా.ప్ర., అనిట్, ఆత్మనేపదీ. లోట్ - ప్రథమపురుషైకవచనమ్, **లప్స్యతే**-లప్స్యేతే-లప్స్యన్తే.

2) అర్చ (అర్చ్) పూజాయామ్(పూజించుట)-సకర్మకమ్, భ్వా.ప్ర., అనిట్, ఆత్మనేపదీ. లోట్ - మధ్యమపురుషైకవచనమ్, **అర్చసి**-అర్చథః-అర్చథ.

**6) అలంకారములు:-** ఇందు 1) పయస్సు-చేతస్సులకును, కుముద-వీక్షణములకును సాదృశ్యము, గమ్భీరానదికి నాయికతో అర్థసామ్యము గాన, కుముదవిశదాని అనుచోట **లుప్తోపమ**ను, 2) ఉద్వర్తనములయందు చూపులను ఆరోపించుటవలన రూపకమును, 3) అంగాంగి భావమున 'సంకరాలఙ్కారము'ను చెప్పదగును.

రూపకలక్షణమ్:- మూ.: *ఉపమైవ తిరోభూతభేదా రూపకముచ్యతే।*
*యథా బాహులతా పాణిపద్మం చరణపల్లవః॥* - కా.ద.-2.66

"కప్పివేయబడిన భేదముగల ఉపమాలంకారమే రూపకముగా చెప్పబడుచున్నది. ఉపమానోపమేయములు భిన్నములైనను (వానికి భేదములేనట్లు) ఉపమేయమునకు ఉపమానముతో తాదాత్మ్యమును చెప్పినచో అది 'రూపకాలఙ్కార'మని అర్థము. రూప యతి-ఉపమానోపమేయములకు ఏకరూపత్వమును కల్పించునదిగాన 'రూపకము' అని దీని అర్థము. - బాలానన్దినీవ్యాఖ్యా.

**సఞ్జీవినీవ్యాఖ్యా:-** గమ్భీరాయా ఇతి । గమ్భీరా నామ సరిత్ ఉదాత్తనాయికా చ ధ్వన్యతే। తస్యాః ప్రసన్నేఽనురక్తత్వాద్దోషరహితే చేతసీవ ప్రసన్నేఽతినిర్మలే పయసి । ప్రకృత్యా స్వభావేనైవ సుభగః సున్దరః। 'సున్దరేఽధికభాగ్యే చ దుర్దినేతరవాసరే । తురీయాంశే శ్రీమతి చ సుభగః" ఇతి శబ్దార్ణవే। తే తవ ఛాయా చాసావాత్మా చ । సోఽపి ప్రతిబిమ్బ శరీరం చ ప్రవేశం లప్స్యతే । 'అపి' శబ్దాత్ ప్రవేశమనిచ్ఛోరపీతి భావః । తస్మాచ్ఛాయా ద్వారాపి ప్రవేశావశ్యం భావిత్వాదస్యా గమ్భీరాయాః। కుముదవద్విశదాని ధవలాని చటులాని శీఘ్రాణి శఫరాణాం మీనానాం ఉద్వర్తనాన్యుల్లుణ్ఠనాన్యేవ ప్రేక్షితాన్యవలోకనాని। "త్రిషు స్యాచ్చటులం శీఘ్రమ్" ఇతి విశ్వః । ఏతావదేవ గమ్భీరాయా అనురాగలిఙ్గమ్। ధైర్యాద్ధార్ష్ట్యాత్, వైయాత్యాదితి యావత్ । మోఘీకర్తుం విఫలీకర్తుం నార్హసి, నానురక్తా విప్రలబ్ధవ్యేత్యర్థః । ధూర్తలక్షణం తు--"క్లిశ్నాతి నిత్యం గమితాం కామినీమతిసున్దరః। ఉపైత్యరక్తాం యత్నేన రక్తాం ధూర్తో విముఞ్చతి ॥" ఇతి ॥ 40 ॥

**బ్రహ్మప్రకాశికావ్యాఖ్యా:-** గమ్భీరాయా ఇతి । హే శ్రీకృష్ణ! ప్రసన్నే నిర్మలే చేతస్యన్తఃకరణే తే తవాత్మాస్వరూపమివ యథా తవాత్మా అన్తఃకరణావచ్ఛిన్నో జీవాత్మతాం ప్రాప్తః, తథా గమ్భీరాయా నద్యా మహానద్యా గమ్భీరత్వాత్। ప్రసన్నే పయసి తే తవ ఛాయా ప్రతివిమ్బోఽపి ప్రవేశం లప్స్యతే । రథచలనకాలే తస్యాః పయసి సూర్యస్యేవోర్ధ్వగస్య తవ ప్రతివిమ్బ-ప్రవేశో భవిష్యతీత్యర్థః । తస్మాత్త్వం, అస్యా మహానద్యాః । కుముదవ ద్విశదాని అవలోకన యోగ్యాని । చటురా(లా)ణాం శఫరాణాం మత్స్యానాముద్వర్తనాన్యేవ ప్రేక్షితాని యత్రార్థమాగతాయా ఇవ త్వాం ప్రతీక్షణాని। ధైర్యాత్ రథస్యాచలనేన మోఘీకర్తుం నార్హసి । యథా పూర్ణకామస్య తవ జీవభావాయాన్తఃకరణప్రవేశః పరార్థం తథైవ మహానద్యాః। పయసి ప్రతివిమ్బ-ప్రవేశః । తస్యాః ప్రత్యబ్దం ప్రవృద్ధాయాస్తవ దర్శనార్థమాగతాయా దర్శనాకాంక్షాం పూరయతు । అనవస్థాయ శీఘ్రం చలేతి భావః ॥ 40 ॥

**విద్యుల్లతావ్యాఖ్యా:-** అథాస్య 'ప్రాప్య వర్షాగ్రబిన్దూన్' ఇత్యాదినా వర్షణస్య ప్రస్తావాత్ సలిలరిక్తస్య తదాస్వాదభూమిం వైదగ్ధ్యాత్ప్రకాశయతి - గమ్భీరాయా ఇతి । గమ్భీరేతి నద్యాః సంజ్ఞా। ప్రసన్నే పఙ్కాదిరహితే, విషయాన్తరవిక్షేపవిక్షోభవిరహసుస్థితే చ। ఛాయా ప్రతిబిమ్బం కాన్తిశ్చ ఆత్మా తత్ప్రకృతిరూపం శరీరముభయమపి। ఉపరిగచ్ఛతస్తవ స్వచ్ఛత్వాత్సలిలే। ఆత్మాపి బిమ్బరూపం చ । తస్మిన్నవలమ్బనేన ప్రవేశం ప్రాప్స్యతి,

కాన్తిః,తదాశ్రయశ్చ శరీరం చేతసీవేత్యర్థః, నయనప్రీతిపూర్వమేవ చిత్తాసఙ్గస్యోపపత్తేః । 'ఛాయాత్వనాతపే కాన్తౌ ప్రతిబిమ్బార్కజాయయోః' ఇతి వైజయన్తీ । అథవా ఛాయాత్మా ప్రతిబిమ్బశరీరమ్ । 'ఆత్మా జీవే ధృతౌ దేహే' ఇతి వైజయన్తీ। అపిర్భిన్నక్రమో గమ్భీరాయా అపీతి నిర్విన్ద్యాదిభిః సముచ్చయార్థః। ప్రకృతిసుభగః స్వభావేనైవ కృత్రిమవేషమన్తరేణ సున్దరః, స్నిగ్ధముగ్ధశ్యామలలావణ్యాదిగ్ధవియదన్తరాలత్వాదితి భావః । తస్మాత్ యస్మాత్ భవన్తం హృదయేనోద్వహన్తీ ప్రకృష్టప్రేమప్రవణా వర్తతే, తస్మాత్కారణాత్ । కుముదవిశదాని వికసితకుముదధవలాని। అనేన హర్షవికసితనయనసితభాగప్రభాపటపరివీతకనీనికానీలి-మత్వం ద్యోత్యతే, హర్షచరితే -- 'అస్నపయదివ ధవలితదశదిశా దృశా' ఇతి । త్వం నార్హసి, తద్యోగ్యోఽన్య ఏవ నీరసజన ఇత్యర్థః । ధైర్యాత్ తద్విషయార్ద్రతావిరహాదిత్యర్థః । మోఘీకర్తుం నిష్ఫలాని కర్తుమ్,ప్రణయపిశునానాం ప్రమదావిలోకనానాం ప్రియప్రావణ్య ఫలత్వాత్ తదనభినన్దనేన త్వయి వ్రజతి సతి నితరాం తవ నీరసత్వం భవిష్యతీతి భావః । చటులశఫరోద్వర్తనప్రేక్షితాని చఞ్చలాని శఫరాఖ్యమత్స్యవిశేషపరిస్ఫురణరూపాణి విలోకనాని। చటులత్వం హ్రీయన్త్రణయా స్థిరత్వాభావః, మత్స్యస్ఫురణస్వభావశ్చ । శఫర గ్రహణం తేషాం నయనసామ్యప్రసిద్ధేః। ప్రేక్షితానీతి, ప్రకృష్టరసవర్షిత్వం ప్రోపసర్గేణ, వివిధభావవికసితవిలాసభఙ్గీతరఙ్గితత్వాద్బాహువిధ్యం చ బహువచనేన ద్యోత్యతే । అత్ర సమాసోక్త్యలఙ్కారః ॥ 40 ॥



శ్లో॥ తస్యాః కిఞ్చిత్కరధృతమివ ప్రాప్తవానీరశాఖం
హృత్వా నీలం సలిలవసనం ముక్తరోధోనితమ్బమ్।
ప్రస్థానం తే కథమపి సఖే లమ్బమానస్య భావి
జ్ఞాతాస్వాదో వివృతజఘనాం కో విహాతుం సమర్థః॥ 41

## - మృణాళినీ వ్యాఖ్యా -

పదవిభాగము:- తస్యాః, కిఞ్చిత్, కర-ధృతమ్, ఇవ, ప్రాప్త-వానీర-శాఖమ్,
హృత్వా, నీలమ్, సలిల-వసనమ్, ముక్త-రోధో-నితమ్బమ్।
ప్రస్థానమ్, తే, కథమ్, అపి, సఖే, లమ్బమానస్య, భావి,
జ్ఞాత+ఆస్వాదః, వివృత-జఘనామ్, కః, విహాతుమ్, సమర్థః॥

ప్రతిపదార్థము:- హే మేఘ! - ఓ మేఘుడా!

ప్రాప్త-వానీర-శాఖమ్ = పొందబడిన రెల్లు కొమ్మ గలదియు,
కిఞ్చిత్ = కొంచెము,
కర-ధృతమ్ ఇవ = చేతితో పట్టుకొనబడిన దానివలె నున్నదియు,
ముక్త-రోధో-నితమ్బమ్ = విడువబడిన తటమనెడు పిఱుదు కలదియునగు,
తస్యాః = ఆ గంభీరానది యొక్క,
నీలమ్ = నీలమైన,

సలిల-వసనమ్ = జలవస్త్రమును,
హృత్వా = హరించి,
లమ్బమానస్య = వ్రేలాడుచున్నట్టి,
తే = నీయొక్క
ప్రస్థానమ్ = ప్రయాణము,
కథమ్-అపి = ఎటులనో,
భావి = సాగును,
జ్ఞాత+ఆస్వాదః = రసానుభూతికల,
కః = ఎవడు,
వివృత-జఘనామ్ = నగ్నజఘనముగల దానిని,
విహాతుమ్ = విడుచుటకు,
సమర్థః = శక్తిమంతుడగును.

**తాత్పర్యము:-** ఓ మేఘుడా! పొందబడిన రెల్లుకొమ్మగలదియు, కొంచెము చేతితో పట్టుకొనబడిన దానివలెనున్నదియు, విడువబడిన తటమనెడు పిఱుదుకలదియునగు, ఆ గంభీరానదియొక్క నీలమైన జలవస్త్రమును హరించి, వ్రేలాడుచున్నట్టి నీ ప్రయాణము ఎటులనో సాగును. రసానుభూతికల ఎవడు నగ్నజఘనముగల దానిని విడుచుటకు శక్తిమంతుడగును?

**- పదాదర్శః -**

**1) విభక్తులు-అవ్యయములు-కృత్తులు-క్రియలు:-**

ప్రాప్తవానీరశాఖమ్-(ద్వి.ఏ.), కిఞ్చిత్-(అవ్య.), కరధృతమ్-(ద్వి.ఏ.), ఇవ- (అవ్య.), ముక్తరోధోనితమ్బమ్-(ద్వి.ఏ.), తస్యాః-(ష.ఏ.), నీలమ్-(ద్వి.ఏ.), సలిలవసనమ్-(ద్వి.ఏ.), హృత్వా-(కృత్తు), లమ్బమానస్య-(ష.ఏ.), తే-(ష.ఏ.), ప్రస్థానమ్-(ప్ర.ఏ.), కథమ్-(అవ్య.), అపి-(అవ్య.), భావి-(కృత్తు), జ్ఞాతాస్వాదః -(ప్ర.ఏ.), కః-(ప్ర.ఏ.), వివృతజఘనామ్-(ద్వి.ఏ.), విహాతుమ్-(కృత్తు), సమర్థః -(ప్ర.ఏ.).

**2) సమాసములు:-**

అ) కరేణ ధృతమ్, తత్, కరధృతమ్, (తృ.త.)
ఆ) ప్రాప్తా వానీరశాఖా యేన, తత్-(బహువ్రీహిః), ప్రాప్తవానీరశాఖమ్.
ఇ) సలిలమేవ వసనమ్, తత్, సలిలవసనమ్, (రూపకసమాసః).
ఈ) రోధ ఏవ నితమ్బః, రోధోనితమ్బః (రూపకసమాసః), ముక్తః, రోధోనితమ్బో యేన తత్, (బహువ్రీహిః), ముక్తరోధోనితమ్బమ్.
ఉ) వివృతం జఘనం యస్యాః తామ్, వివృతజఘనామ్, (బహువ్రీహిః).

**3) పాఠాంతరములు:-** 1) హృత్వా > నీత్వా 2) వివృతజఘనామ్ > ఫులినజఘనామ్, పులినజఘనామ్

**4) పదవ్యుత్పత్తి-నిఘంటుప్రమాణములు-కావ్యప్రయోగములు:-**

**అ) వానీరః:**-1) వాయతి శుష్యతి ఇతి । వై+క్విప్। వా శుష్యత్ నీరం యస్మాత్।

2) శ్లో॥ *వానీరో వఞ్జులః శీతో విదులో వేతసః స్మృతః॥* -హలాయుధకోశః

3) శ్లో॥ *అత్రానుగోదం మృగయానివృత్తః-తరఙ్గవాతేన వినీతఖేదః।*
*రహస్త్వదుత్సఙ్గనిషణ్ణమూర్ధా-స్మరామి **వానీర**గృహేషు సుప్తః॥* - ర.వం. 13.35

"…….గోదావరి ఒడ్డుననున్న రెల్లుపొదలలో, వేటనుండి వచ్చి తరంగ వాయువులు నా శ్రమను తొలగించి హాయినిగూర్చగా, నీ తొడపై నాతల నుంచి నేను నిద్రించినది స్మరించుకొనుచున్నాను."

4) శ్లో॥ ఇహ సమదశకున్తాక్రాన్తవానీరవీరుత్
*ప్రసవసురభిశీతస్వచ్ఛతోయా వహన్తి।*
*ఫలభరపరిణామశ్యామజమ్బూనికుఞ్జ*
*స్ఖలనముఖరభూరి స్రోతసో నిర్ఝరిణ్యః॥* - ఉ.రా. 2.20

"ఇచట మదించిన పక్షులచే ఆక్రమింపబడిన, రెల్లు(ప్రబ్బలి) తీగల పూలతో పరిమళించుచు చల్లనై, స్వచ్ఛమైన జలము గలవియునగు వాగులు, కాయలన్నీ పండుటచే నల్లనైన నేరేటి పొదలకు వాగునీరు తగులుటచే ఉబికి వానినుండి దూసికొనివచ్చుటచే మ్రోతలు గలిగి పాఱుచున్నవి."

ఈ శ్లోకమును-భవభూతి మాలతీమాధవమునందును చెప్పినాడు. ఈ శ్లోకమునందలి ఈ సౌభాగ్యము-మేఘదూతమహాకావ్యమునుండి సంతరించుకొన్నదే. జమ్బూకుఞ్జ…, త్వయాసన్నే….శ్లోకములు చూడదగును.

**ఆ) విపృతజఘనామ్ > పులినజఘనామ్**

1) 'పులినజఘనామ్' అనుపాఠమునకే సౌందర్య మెక్కువ. భరత, సనాతన, రామనాథ, హరగోవింద, కళ్యాణమల్ల, విల్సన్ మొదలగువారు ఈ పాఠమునే స్వీకరించి వివరించినారు. "పులినమేవ జఘనం యస్యాః సా తాం తయోక్తామ్" సారోద్ధారిణి, మేఘలత, మహిమ, వల్లభ, సుమతివిజయ మొదలగువారు 'విపులజఘనామ్' అనుపాఠమును స్వీకరించి వివరించినారు. 'విస్తీర్ణకటితటీమ్/పృథుకటీమ్/రమ్యజఘనప్రదేశామ్'. వల్లభ దేవుడు - "పృథులతీరాం పృథు నితమ్బాఞ్చ"।

2) **జఘనమ్** - ఉణాదిసూత్రమ్. i) హన్తేః శరీరావయవే ద్వే చ। (5-32), ii) వృ-హన్తి యేన యద్ వా హన్యతే తత్ జఘనమ్, జనోరుపరిభాగో వా। ఇవార్థే శాఖాదిత్వాత్, యత్ - జఘనమివ 'జఘన్యం' నీచమ్.

iii) "*ప్రథమసమాగమలజ్జితయా పటుచాటుశతైరనుకూలమ్।*
*మృదుమధురస్మితభాషితయా శిథిలీకృతజఘనదుకూలమ్॥*

సఖి! హే కేశిమథనముదారం రమయ మయా సహ మదనమనోరథ భావితయా సవికారం ధ్రువమ్॥ *- గీత గోవిందకావ్యమ్. 6-2 - వావిళ్ళప్రతి.*

"...నాయకోత్తముడగు శ్రీకృష్ణుని దర్శనమువలన దృఢబంధయయ్యు దనంతటనే పోకముడి విడిపోవుటచే, మేఖలాలంబితమై జఘనమాత్రస్థాయియగు దుకూలము మాత్రమే శ్రీకృష్ణునిచే నపహరణీయమను నర్థమును 'జఘన' పదము తెల్పుచున్నది. ఈ విషయము **రతిరహస్యము** నందిట్లు చెప్పబడినది.

శ్లో॥ *ఓష్ఠాగ్రం స్ఫురతీక్షణే విచలతః కూపోదరే మత్స్యవ*
*ద్ధమిల్లః కుసుమాకులో విగళతి ప్రాప్నోతి బన్ధం పునః।*
*ప్రచ్ఛన్నౌ వ్రజత స్తనౌ ప్రకటితం శ్రోణీతటం దృశ్యతే*
*నీవీ చ స్ఖలతి స్థితాపి సుదృఢం కామేంగితే యోషితామ్॥*

ఇ) **నితమ్బః** :- 1) నిభృతం తభ్యతే కాముకైః, తము కాంక్షాయామ్।

*2) శ్లో॥ స్నిగ్ధం వీక్షితమన్యతోఽపి నయనే యత్ప్రేరయన్త్యా తయా*
*యాతం యచ్చ* ***నితమ్బ****యోర్గురుతయా మన్దం విలాసాదివ।*
*మాగా ఇత్యుపరుద్ధయా యదపి సా సాసూయముక్తాసఖీ*
*సర్వం తత్కిల మత్పరాయణమహో కామీ స్వతాం పశ్యతి॥*

".......పిఱుదులయొక్క బరువుచే విలాసమువలన వలె నెమ్మదిగా నడవబడుచున్న దనెడిది ఏది కలదో....."

ఈ) **భావి** :- భవిష్యతీతి భావి. భూ+ణినిః > భావి (కృత్తు) (ప్ర.ఏ.)

**5) క్రియారూపములు:-**

**6) అలంకారములు:-** ఇందు 1) 'కరధృతమివ' అనుచోట '**ఉత్ప్రేక్ష**' ను 2) రోధమందు నితంబము, సలిలమందు వస్త్రము ఆరోపితమగుటవలన '**శాబ్దికరూపకము**'ను 3) గమ్భీరానదియందు నాయికారోపణముచే '**ఏకదేశవివర్తిరూపకము**' ను, 4) **సంకరాలంకారము** ను చెప్పదగును.

1) ఉత్ప్రేక్షలక్షణమ్:- కా॥ సంభావనమథోత్ప్రేక్షా ప్రకృతస్య సమేన యత్।
వృ॥ సమేన ఉపమానేన.

2,3) రూపకలక్షణమ్:-

కా॥ i) తద్రూపకమభేదో య ఉపమానోపమేయయోః।
ii) సమస్తవస్తువిషయం శ్రౌతా ఆరోపితా యదా। (23)
iii) శ్రౌతా ఆర్థాశ్చ తే యస్మిన్నేకదేశవివర్తి తత్।

"దేనియందు ఆరోపించబడేవి సాక్షాత్తు శబ్దం చేత చెప్పబడేవి, అర్థాన్నిబట్టి ఊహించ బడేవి ఆక్షిప్తములు అవుతాయో, అది ఏకదేశవివర్తిరూపకము".

4) సంకరాలఙ్కారలక్షణమ్:- కా॥ **అవిశ్రాన్తిజుషామాత్మన్యఙ్గాఙ్గిత్వం తు సఙ్కరః॥**

సఞ్జీవినీవ్యాఖ్యా:– తస్యా ఇతి। హే సఖే! ప్రాప్తా వానీరశాఖా వేతసశాఖా యేన తత్తథోక్తమ్। అత ఏవ కిఞ్చిదీషత్కరధృతం హస్తావలమ్బితమివ స్థితమ్ । ముక్తస్త్యక్తో రోధస్తటమేవ నితమ్బః కటిర్యేన తత్తథోక్తమ్ । "నితమ్బః పశ్చిమే శ్రోణిభాగేఽద్రికటకే కటౌ" ఇతి యాదవః । నీలం కృష్ణవర్ణం తస్యా గమ్భీరాయాః సలిలమేవ వసనం నీత్వాఽపనీయ। ప్రస్థానసమయే ప్రేయసీవసనగ్రహణం విరహతాపవినోదనార్థమితి ప్రసిద్ధమ్ । లమ్బమానస్య పీతసలిలభరాల్లమ్బమానస్య । అన్యత్ర, – జఘనారూఢస్య । తే తవ ప్రస్థానం ప్రయాణం కథమపి కృచ్ఛ్రేణ భావి । కృచ్ఛ్రత్వే హేతుమాహ –– జ్ఞాతేతి। జ్ఞాతాస్వాదోఽనుభూతరసః కః పుమాన్ వివృతం ప్రకటీకృతం జఘనం కటిస్తత్పూర్వభాగో వా యస్యాస్తామ్। "జఘనం స్యాత్కటౌ పూర్వశ్రోణిభాగాపరాంశయోః" ఇతి యాదవః। విహాతుం త్యక్తుం సమర్థః? న కోఽపీత్యర్థః ॥ 41 ॥

బ్రహ్మప్రకాశికావ్యాఖ్యా:– తస్యా ఇతి । పూర్వం ఛన్నోపాన్తః పరిణతేత్యాదిశ్లోకే నిర్దిష్టస్య పరామర్శాదత్ర తత్ శబ్దేన సమ్బోధనమ్ । హే శేష! బలభద్ర! ఖే రథావచ్ఛిన్న ఆకాశే స్వవసనగ్రహణాయ ప్రతివిమ్బ–వ్యాజేన లమ్బమానస్య, తే తవ ప్రస్థానం కథమపి భావి న భవిష్యతీత్యర్థః । కిం కృత్వా, ప్రాప్తవానీరశాఖమతస్తస్యా మహానద్యాః కిఞ్చిత్కరధృత మివేత్యుత్ప్రేక్షా। వలాన్నీతస్య ద్రవ్యస్యైకదేశోద్ధరణం యుజ్యత ఏవ । అపహ్నవార్థం నితమ్బస్థాపితత్వాత్ హృత్వా తత్ర ఆనీతత్వాన్ముక్తరోధో నితమ్బం ఈదృశం తస్యా సలిలమేవ త్వదీయం నీలం వసనమ్ । మదీయమిదం త్వయా శౌర్యేణ నీయత ఇతి హృత్వా బలాద్గృహీత్వా గమనాభావే హేతుమర్థాన్తరన్యాసమాహ । జఘనస్యాఙ్కశ్చిహ్నం జఘనాఙ్కో వసనమ్, విపులః స యస్య స విపులజఘనాఙ్కః పరిహితలమ్బవసనః । ఇదం మదీయమితి స్వకీయద్రవ్యస్య జ్ఞాతా । స్వాదః । స్వమాత్మీయద్రవ్యం న దదాతీతి స్వాదః। స్వమాదత్త ఇతి వా । ప్రాదేరాదన్తాది త్వత్ । పరేణ నీతం స్వద్రవ్యం జ్ఞాత్వాఽత్యజన్నిత్యర్థః । ఈదృశో జనః । ఓహాజ్ గతౌ । విహాతుం విశేషేణ గన్తుం సమర్థో భవత్యధ్యాహారః । పరిహితదీర్ఘవస్త్రోఽత్యజంశ్చ జ్ఞాత్వా స్వం ద్రవ్యం వివదమానో హి శీఘ్రం గన్తుం న శక్నోతీత్యర్థః । త్వమప్యనవస్థాయ శీఘ్రం చలేతి భావః ॥ 41 ॥

విద్యుల్లతావ్యాఖ్యా:– అథ తదుపభోగరసప్రసఙ్గేనాస్య గమనవిలమ్బమాశఙ్క్య భఙ్గ్యా నిషేధతి –– తస్యా ఇతి । కిఞ్చిదితి ధారణక్రియావిశేషణం కరేణేషన్నివారితమివేతి । మదనసుహృదో మనసః సంవాదేఽపి త్రపాపరవశతయా కరేణ శిథిలధృతమివ । ప్రాప్తవానీరశాఖం స్పృష్టవేతసవిటపమ్। హృత్వా ఆదాయ, ఆక్షిప్య చ । ముక్తరోధోనితమ్బమ్ అనేన సలిలస్యాపీయమానత్వే క్షీయమాణత్వాద్వర్ణితం నీరరూపం శ్రోణిమణ్డలం యేన। ఏతచ్చ హరణకాలవిశేషణమ్ । హృత్వా లమ్బమానస్యేత్యన్వయః । లమ్బమానస్య జలభరగౌరవాదవనమతః, రసమగ్నతయా కాలం క్షిపతశ్చ । ప్రస్థానం తత్సమీపాత్ ప్రయాణమ్। కథమపి భవతీత్యుక్తిద్వారేణ ప్రయత్నతోఽపి కర్తవ్యమిత్యుక్తమ్ । సఖే ఇతి,

ప్రియవయస్యేన త్వయా న విస్మర్తవ్యా మద్దశేతి ద్యోతయతి । వసనహరణే బిలమ్బో- ఽ వశ్యమ్భావీతి కథం నిశ్చీయత ఇతి చేత్తత్రాహ -జ్ఞాతాస్వాద ఇతి। విదితభోగరసః । వివృతజఘనాం ప్రకటితవికటకటితట పురోభాగామ్ । 'పశ్చాన్నితమ్బః స్త్రీకట్యాః క్లీబే తు జఘనం పురః' ఇత్యమర । వివృతేతి, స్వానుకూల్యం ద్యోతయతి 'అనుకూల్యరసాః స్త్రియః' ఇత్యుక్తత్వాత్, సా హి రసస్య పరా కాష్ఠేతి భావః। జఘనేతి, దయితాయాః కణ్ఠమూలకక్షవక్షోరుహాదీనామపి హృదయగన్ధసిన్ధుర బన్ధనాలానత్వాత్, మదనసార్వభౌమ గర్వసర్వస్వఖనిపర్వతే జఘనపులినే ప్రకాశితే కిం పునరితి భావః । క ఇతి క్షేపే, శాన్తనవోఽ పి న శక్త ఇత్యర్థః । విహాతుమితి, ఆస్తాం దవీయస్యస్య సేవనమ్, సేవనానన్తర మపి పరిత్యాగో న సుకర ఇతి వ్యజ్యతే । అత్రోత్ప్రేక్షారూపకసమాసోక్త్యర్థాన్తరన్యాసాః సఙ్కీర్ణాః । అర్థాన్తరన్యాస ఏవోద్భావ్యతే । ఏవమన్యత్రాపి బహూనాం సఙ్కరసంసర్గే ప్రధానస్యైకస్యైవ నిర్దేశః క్రియతే, గ్రన్థవిస్తరభయాదశక్యత్వాచ్చ॥ 41 ॥



**శ్లో॥ త్వన్నిష్యన్దోచ్ఛ్వసితవసుధాగన్ధసమ్పర్కరమ్యః**
**స్రోతోరన్ధ్రధ్వనితసుభగం దన్తిభిః పీయమానః।**
**నీచైర్వాస్యత్యుపజిగమిషోర్దేవపూర్వం గిరిం తే**
**శీతో వాతః పరిణమయితా కాననోదుమ్బరాణామ్॥ 42**

**- మృణాళినీ వ్యాఖ్యా -**

**పదవిభాగము:-** త్వత్+నిష్యన్ద+ఉత్+శ్వసిత-వసుధా-గన్ధ-సమ్పర్క-రమ్యః, స్రోతోరన్ధ్ర-ధ్వనిత-సుభగమ్, దన్తిభిః, పీయమానః। నీచైః,+వాస్యతి, +ఉపజిగమిషోః,+దేవపూర్వమ్, గిరిమ్, తే శీతః, వాతః, పరిణమయితా, కానన+ఉదుమ్బరాణామ్॥

**ప్రతిపదార్థము:-** హే మేఘ! - ఓ మేఘుడా!

త్వన్నిష్యన్ద....రమ్యః = నీవు వర్షించుటచేత ఊఅటచెందిన భూమియొక్క గంధపు కూడికచేత సువాసన గలదియు.
స్రోతో....సుభగమ్ = నాసికారంధ్రముల యందలి ధ్వనిచేత వినుటకింపైనట్లుగా
దన్తిభిః = ఏనుగులచేత,
పీయమానః = ఆఘ్రాణించబడినదియు,
కాననోదుమ్బరాణామ్ = అడవి మేడి కాయలను,
పరిణమయితా = పండించునదియునగు,
శీతః = చల్లనైన
వాతః = గాలి
దేవపూర్వమ్ గిరిమ్ = దేవగిరినిగూర్చి,
ఉపజిగమిషోః = చేరబోవుచున్న,
తే = నీకు,

